# తెంకణాదిత్యకవి

చేత

దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డి

కుమారసంభవ

భాషావాద విమర్శ.

# సూచిక

# తొలిపలుకులు

'ఈతని గ్రంథాంత 'జయ వైచిత్ర సంపద'లో నేదో ధ్వని యున్నది గాని తెలియుటలేదు. శ్రీ దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డిగారి అక్షర సాంఖ్యాగణనము సరియే గాని వారి తారీఖు క్రీ. శ. 1054 భాషాపరిణామాదిక విషయమున కుదురక పోవుటచే దీని తత్వ మేమో శోధించి శ్రీ రెడ్డిగారే మున్ముందు వివరింపఁ గర్తలు.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (227 పుట)

ప్రియ మిత్రులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారిట్లు నా సమాధానము కోరినందువల్ల, ఈ తెంకణాదిత్యకవి విమర్శ వ్రాయడమైనది. తప్పులున్న క్షమింపుడు.

అవతారికలో చోడకవి నేనును 'దైవజ్ఞు నట్ల(నే)శుభోదయమున (యొక్క) దివ్య సుకృతి ప్రతిష్ఠింతు'నని ప్రతిజ్ఞ చేసి, తదుదాహరణ దేశకాల గణితములను కథేతర వంగ్య వస్తు కవితలో తన చరిత్రగా ప్రతిష్ఠించి నప్పుడు, ఆ కావ్యమందలి క్రీ. శ. 1054 తేది నా కల్పనకాదు కద! పెద్ద లన్నట్లు భాషా వాదములో ఏదో లోపమున్నది.

'ఈనాడు సాహిత్య రంగంలో హేతువాదము పోయి భాషయందును ఆలోచనలోను అస్పష్టత క్లిష్టత ఏర్పడినది.'

—డా. సి. పి. రామస్వామి అయ్యర్‌గారు

(ఆంధ్ర పత్రిక, డిసంబరు 18, 1950 తేది.)

గణిత సిద్ధాంతముగా ఉన్న 'తుల్యా తారక(వి)తతులు' లేవనుట హేతువాద లోపనే కాని, భాషాపరిణామ క్రమ చరిత్ర సమ్మతము కాదు.

'సత్యాన్వేషణంలో ప్రతిజ్ఞా విషయాన్ని గణితశాస్త్రజ్ఞులు మాత్రమే సరిగ్గా నిర్ణయించినట్లు, పూర్వపు అనుభవాన్ని బట్టి తేలుతున్నది కనుక, దానిని ప్రధాన ప్రమాణంగా నిర్ణయించుకొనడం (చారిత్రక పద్ధతి).'

—ప్రమాణ మీమాంస

**(by Rene Descartes)**

(భారతి - డిసంబరు, 1959 - పుట 95)

రెనె డెస్కార్ట్సు – ఆంగ్లపండితుని – సిద్ధాంతమునకు ముందే గణిత పూర్వానుభవాన్ని దైవజ్ఞకవిచోడుడు ప్రతిపాదించి, తార్కాణించినట్లు తత్ప్రతిజ్ఞ సూచించుచున్నది.

భారత కథలో ఉన్న క్రింది పద్యములో తత్కవి నన్నయభట్టు సమకాలము స్థూలముగా కలదన వీలున్నది కాబట్టి, భాషావాదు లిందులో చిత్రకవితలు సాధించి-సూక్ష్మకాలమును పద్యరూపములో కల్పించి–చూపినప్పుడే చోడ 'కవియభిప్రాయము ప్రకారము అది తారీఖుగాక వట్టి ఘుణాక్షర న్యాయమున నొక (కాల)సంఖ్య లబ్ధమైనదేమో!' (వే. న. క. 13 పుట) అనుట కవకాశమున్నది. లేనిచో భాషాకల్పిత దోషకాలము చెల్లదు.

ఉ. 'సాత్యవతేయ విష్ణుపద
సంభవమై విబుధేశ్వరార్థి సం

గ త్యుపశోభితంబయి జ
　　గద్విితంబగు భారతీయ భా
ర త్యమరాప గౌఘము ని
　　రంతర సంతత పుణ్యా సంపదు
స్న త్యభివృద్ధిసేయు విని
　　సంగొని యాడిన సెల్లవారికిఁ.'

—నన్నయభట్టు
(భారత., ఆది. 1-73 పద్యము.)

ఇందలి 'విబుధేశ్వరాబ్ధి సంగతి' వక్రోక్తిలో సంఖ్యా శాస్త్రప్రకారము 'విబుధ – చంద్ర – ౧, ఈశ్వర – రుద్ర – ౧౧, అబ్ధి – సముద్ర – ౪ సంగతి – కలియక ఈశ్వరా(బ్ధి)' ఉపశోభితంబగుచున్నది. శ్లేషలో 'అబ్ధి' తేలిపోయి 'అబ్ది' యై కాలసూచన చేయుచున్నది. ఇందలి సంఖ్యలు వామగతిగా మారినయెడ లిందు కలి ౪౧౧౧ గతాబ్దములకు నేటి ఈశ్వరాబ్ది సమకాలము కావలసియున్నది. కాని, ఈ కాలసూత్ర సంగతిలో 28 వర్ణ సంఖ్యలు – అనగా 28 తారక తతులు – అభిజిత్తుతో కూడిన 28 పూర్ణ నక్షత్ర సంఖ్యలు – కాలదోషముగా కలవు. అయినప్పటికి కవి సమకాలమిందున్నదనుట గణిత సిద్ధాంతము.

ఈ నన్నయ పద్య కాలదోష సమకాలము కలి ౪౧౩౭ వర్షంబులగు నేటి ఈశ్వరాబ్ది సంగతియై క్రీ. శ. 1037 సంవత్సరమునకు సరియగు ఈశ్వర సంవత్సరము గోచరింప చేయుచున్నది. ఇది ఘుణాక్షర న్యాయకాలమైనను, క్రీ. శ. 11 శతాబ్ద నన్నయ సమకాలము నిచ్చుచున్నదో, క్రీ. శ. 14

శతాబ్ద విషయకాలము నిచ్చుచున్నదో భాషాతత్త్వ కాల వేత్తలు యోచించుట న్యాయము.

'అన్యతార కవితతుల - నాదరిం(తు).'

—కు. సం. (1-34)

ఇందలి 'అన్య(కవి) 28 తారక — —, తతులు ఆదరించి, అనాదరించి(తి)' నే ననుట చోడకవి నన్నయ పద్య కాలదోషము నాక్షేపించుట కాబోలు. కరికాలజకవి దోషములను నన్నయ కూడ భారతములో పేర్కొన్నాడు.

ఒక గ్రంథమందలి రెండు కాలాధారములలో గణిత కాలము క్రీ. శ. 11 శతాబ్దము నాటిది గాను, భాషానిదర్శన కాలము క్రీ. శ. 14 శతాబ్దము నాటిది గాను కలవనుట అసంభవము. ప్రధాన ప్రమాణమయిన గణిత నిదర్శన కాలముతో పాటిదే సందిగ్ధ ప్రమాణమగు భాషా నిదర్శన కాలము కూడ.

చోడకవి ప్రయోగ భాషావాదములలోకూడ పూర్వ-అర్వాచీన భాషా నిదర్శనము లున్నట్లు భిన్నవాదములు కలవు. కల్పిత భాషావాద దోషమునకు ఒక మచ్చు తునక.

'తర్వాత ప్రసంశనీయము ఈతని 'మునిపల్లె'. ఆహా! ఎంత చక్కని మాట! ఎల్లవారును ఋష్యాశ్రమ మనుదానిని 'మునిపల్లె' యన్నది వరాల మూట. మును లుండుటయే గాక పల్లెయుం గూడ. పట్టి యాశ్రమ మాత్రము గాదు. దీని వర్ణనము అష్టాదశ వర్ణనములలో చేరలేదు.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (167 పుట)

ఇట్టిది మరియొకటి. '- - - జనమేజయుండు — — అనేక మునిగణాశ్రమంబులకుం జని యొక్క మునిపల్లెం గ(నె) - - '
—నన్నయభట్టు (ఆది. 1-87)

ఋష్యాశ్రమును మునిపల్లె యన్న ఈతని తీయని పలుకులను ముక్కుతిమ్మన గ్రహించుటలో నే మాశ్చర్యము!'
—వేదం నన్నెచోడుని కవిత్వము (226 పుట)

ఇందలి ఆశ్చర్యమేమి టంటె— తెనుగు భారతములో - శాకుంతల కథలో 'ఈ మునిపల్లె నుండు టిది యేల!' (ఆది.4–54) అనిదుష్యంతుని మాటగా నన్నయభట్టు వ్రాసి ప్రయోగించుట. 'ఆశ్రమంబు - ఋషులపల్లె - మునిపల్లె' అను పర్యాయ పదములు వాడుట.

క్రీ. శ. 11 శతాబ్దమందలి మునిపల్లె అను చోడుని తీయని ముద్దుపలుకును, క్రీ. శ. 11 శతాబ్దమందలి నన్నయ భట్టు మునిపల్లె అని ప్రయోగించి, అనుకరించి నప్పుడు అటు తర్వాత క్రీ. శ. 16 శతాబ్ద ప్రారంభములో ముద్దుపలుకుల తిమ్మనార్యుడు ముచ్చటగా, తీరికగాఆ మునిపల్లెను గ్రహించుటలో ఆశ్చర్యము లేదు. ఒక్కదూకులో భాషావాద మెంతకాలమును దాటినదో లెక్కించిన భాషావాద తత్వ కాల దోషము బోధపడును. ఇట్టి వెన్నోకలవు.

చోడకవి వ్రాయనప్పు డొక చంపకమాలలో 'అన్య (భిన్న – తుల్య) తారకవితతులు' – ఎత్తుగీతి, ద్విరదగతి రగడ, జంపె రగడ; వృత్తము–కళిక–ఉత్కళికలతో ఉదాహరణము, ఖడ్గబంధ చిత్రకవిత గర్భితమై యున్నవనుట కెట్టి ప్రజ్ఞావంతుడన

కైనను సాధ్యమా! ఒకవేళ రగడ కల్పన కుదిరినను, పద్యార్థము కుదురునా? అది కథగాక, కథేతర గణిత సిద్ధాంత తిథివార నక్షత్ర లగ్నముల కలయిక, ఈష ద్భేదము లేక, సమకూర్చ కలదా !

ఇన్ని ఛందో నిదర్శన స్థూల సూక్ష్మకాలములను 'అది తారీఖుగాక వట్టి ఘుణాక్షర న్యాయమున నొక (కాల) సంఖ్య లభ్యమైన దేమో!' అని భాషాతత్వవేత్తలు శంకించుట భాషా వాద లోపము తెలియకనే కద! ఈ గర్భచిత్రకవి 15-3-1054 తేదీ రగడకాలము చారిత్రకముగా భాషా తత్వకాల మేల కాదో తెలియదు!

'అసలు మనం చెత్త అని కొట్టి పారవేసే వాటిల్లోనే అప్పుడప్పుడు కొన్ని మహా సత్యాలు గర్భితం అయివుంటాయి. అందులో (బెర్నార్డ్)షా విషయంలో ఇది మరింత యథార్థం. దాన్ని ఆయన ఇంత చెత్తలోనో ఎక్కడో దాచివుంటాడు. దాన్ని తెలుసుకోగలిగినప్పుడు మనకు దిగ్భ్రమ గల్గుతుంది.'

—ఫ్రాన్సిస్ వాట్సన్

(క్రిక్లిన్ - విమర్శ)

(ఆంధ్రపత్రిక - 15-3-1950 తేది-10 పుట)

ఇంత కెంతో ముందు తెనుగు ప్రబంధ కథలో అభినవ భారవి – తెంకణాదిత్యుడు 'అభ్యుదయనగ'గీతి వస్తుకవితలో తన వ్యంగ్య దేశకాల చరిత్రను 'గణిత గర్భితం'చేసి, దాచి యున్నాడనుట 'శుభోదయము(యొక్క) దివ్య సుకృతి ప్రతిష్ఠ' కాదా!

హెచ్చరిక—

క. 'గుఱు తెఱఁగి వస్తు చయమున
కొఱఁగెడు నా దీపవర్తి - యును బోలె నిజ
మ్మెఱిఁగి కృతి వస్తు సమితికి
వఱలంగ మది నెఱుఁగు విబుధ - వర్గముఁ దలఁతున్.'

—కు. సం. (I-26)

నిజానికిది కావ్యపాఠక స్తుతి యైనను, దీనిలో గూఢముగా వస్తురూప వ్యంగ్య సూచనకూడ స్ఫురించుచున్నది.

ఈ హెచ్చరికలో 'చీకటి – గూఢము' లేకపోయినను, 'దీప(ము) – నిజమ్ము' లేకపోలేదు. చీకటింటి వస్తువులు దీపపు వెలుతురులో కనబడునట్లు, గూఢకావ్య నిజవస్తు సమితి విజ్ఞానములో గోచరించును. ఇట్టిది వస్తుకవితయో, గూఢ వస్తుమయ కవితయో కాబో లనిపించుచున్నది. 'వస్తు వందు రిది కౌశిక లీసుర పేర్మి వింతయే' (కు.సం. 9–180) అనుటచేత, వస్తుకవిత సంకేత వ్యంగ్య వస్తుకవితగా కూడ వ్యంజకమగు చున్నది. పక్షాంతరముగా శ్లేషలో 'గూఢ' తేలిపోయి 'కుమారసంభవమ్ము అలంకారము గూడ'గా అనికూడ అన్వయము కావచ్చును.

'వ్యంగ్యార్థము వాచ్యార్థమును మించి చమత్కార మైనప్పుడే ఒక కావ్యము ధ్వనికోటి నందునని ఆలంకారిక మతము.'

—శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
(భారతి - డిసంబరు, 1959-67 పుట)

చోడకవి వాచ్యచరిత్రకంటె వ్యంగ్య చరిత్ర శ్రేష్ఠమైన దేశద! అది గణిత నిదర్శనములతో కూడుకొన్నప్పుడు సంశయముల కెడ మెక్కడున్నదో భాషావాదులు గుర్తించలేదు.

'సంధ్యవేళయందు చీకటి వెలుగు రెండున్నట్లు సంధ్యా (తంత్ర)భాషకు రెండర్థాలున్నవి.'

—శ్రీ వాసిరెడ్డి పార్థసారథిగారు
(భారతి - డిసంబరు, 1959)

ఈ సంధ్యాకాంతినే చోడకవి చీకటివేళగాను, నక్షత్రవేళగాను మార్చి పేర్కొన్నాడనుట 'తారకవి' తంత్రము. ప్రతారము. ఇంతకు మోసపోక, కృతి సంకేత వ్యంగ్య వస్తు సమితి నిజమ్మెరుగుట పాఠక ధర్మము. ఇది కవి ప్రార్థన. నా మనవి. బిల్హణీయములో ఆ కవి వివరించినట్లు 'యుక్తివాదములచే నొప్పారు తార్కికుల్ - తారకుల్' మోసముచేయరనుట కల్ల.

ఎన్ని తార్కాణములతో గ్రంథమందలి కుమారసంభవ రచనాకాలము నిరూపించినను 'కవి యభిప్రాయము ప్రకారము అది తారీఖు' గాదని 'దీని తత్త్వమేమో' తెలియ దను భాషా తత్త్వవేత్తల వాదము అనుమాన ప్రమాణముగా కూడ చెల్లుబడి కాదు;

'మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమల-గర్భుని వశమే!'

—నన్నయభట్టు (ఆది. 4-72)

'ఎన్ని (మంత్ర-సంఖ్యా) రహస్యములు రామాయణమునందుఁ గలవో యెవ్వ డెఱుంగును.'

—శ్రీ మదాంధ్ర వాల్మీకి రామాయణము, పీఠిక. (60 పుట)

'వస్తు కావ్యాబ్జరవి - వాల్మీ(కి)' గద! అట్టి 'వస్తు కవిత'ను 'సంకేత వస్తుకవిత' యనుట దోషముకాదు; ఇట్టిది సంకేత వ్యంగ్య వస్తుకవిత.

భాషావాద దోష కాలోదాహరణములు కొన్ని మాత్రమే ఈ గ్రంథములో చూపబడినవి. తక్కినవి భాషావాదుల యూహాపోహలు. ముఖ్యసూత్రముల కాధారము లేనప్పుడు తదర్వాచీన కల్పనలకు జవాబు చెప్ప నక్కరలేదు.

'నన్నెచోడుని కవన మహిమ' పదకొండు పేజీలలో, కాల వివాద చర్చ మినహా, భాషావాదులు పేర్కొన్న కవన మహిమ అంగీకరించుట కాక్షేపము లేదు. ప్రశంసనీయము.

ఈ విమర్శ ముఖ్యముగా వేదం నన్నెచోడుని కవిత్వమునకు చెందినదే కాని, అమరేశం నన్నెచోడుని కవిత్వమునకు చెందినది కాదు. ఇవి రెండు భాషావాద గ్రంథములైనను అర్వాచీన — ప్రాచీన భిన్నకాలములను తెల్పుచున్నవి. శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారి కవిరాజ శిఖామణి భాషాకాలముకూడ అర్వాచీన భాషావాదము నంగీకరించదు. ఈ మూడు గ్రంథములు నాకు బహుమతిగా పంపిన గ్రంథకర్తలు మనసుకి నమోవాకములు. సత్యాన్వేషణ

ములో ప్రతికూలాభిప్రాయములు ప్రకటించవలసి ప్రకటించినందులకు మిత్రులందరు నన్ను మన్నింతురని వేడుకోలు. ఇందేమేని దోషములున్న విజ్ఞులు సవరించి తెలిపిన కృతజ్ఞతతో స్వీకరింతును.

ఈ గ్రంథములో కవితా విమర్శ చేర్చలేదు. ప్రసిద్ధ పండితులు చర్చించిన దానికంటె ఎక్కువేమిన్ని చెప్పలేక చెప్పలేదు.

నాటకసూచనలు మాత్ర మిందు చేర్చినాను. నా స్వల్పకృషి నాశీర్వదించిన పండితులకు నమోవాకములు.

ఈ విమర్శను శీఘ్రకాలములో ఓపికగా ముచ్చటగా ముద్రించి యిచ్చిన విజయాప్రెస్, నెల్లూరు, యజమానులకు, కార్యదర్శికి, కూర్పుకారులకు ధన్యవాదములు.

ఉలవపాడు
శ్రీ కృష్ణాష్టమి,
ఆదివారము.
**1882,** శార్వరి,
**14-8-1960.**

ఇట్లు
సత్యాన్వేషి,
దేవరపల్లి వేంకట కృష్ణారెడ్డి

# తెంకణాదిత్యకవి

## అభిప్రాయములు

'నన్నిచోడుడు నన్నయకన్న పూర్వుడనియు ఆతడే యాదికవి యనియు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వాద మారంభించిరి. అది ౪౦ సంవత్సరాలనాటి మాట. నాటినుండి నేటివరకు పండితులు, పరిశోధకులు రెండుపక్షాలు వహించిరి.

శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు ఈ విషయమున ౨౫౦ పుటలు ఉద్గ్రంథమును రచించినారు. వీరి వాదమునకు ప్రోద్బలకముగా శ్రీ రాఘవశాస్త్రి (ఉస్మానియా తెలుగు ప్రొఫెసర్) గారు మరొక ఉద్గ్రంథము వ్రాసినారు. దీనిని ముద్రించువారే కానరాలేదు.

ఈ వాదములో కొందరు నన్నయపైగల అభిమానము చేత ఇంతవరకు సిద్ధమైయున్న సిద్ధాంతమును తారుమారు చేయనొల్లక లేక నిజముగ నమ్మియో నన్నయయే ఆదికవి యన్నారు.

రెడ్డిగారు కుమారసంభవ రచనాకాలము క్రీ. శ. ౧౦౫౪ అని వాదించినారు. ఎవ్వరును త్రొక్కని జాడలను త్రొక్కినారు. క్రొత్తపద్ధతిలో విమర్శించినారు. దానిని బాగుగ సమర్థించినారు. ఎన్నియో యుపపత్తులు చూపినారు. తనను ఖండించిన శ్రీ బండారు తమ్మయ్య ప్రభృతులకు జవాబిచ్చినారు. శాసనాధారములను వివరించినారు.

నన్నిచోడకవి తన కుమారసంభవములో గూఢముగా వస్తుకవితలో తన కృతికాలమును తన రాజధానిని మున్నగు విషయములను ఇమిడ్చినది బయటపెట్టినారు. దేశికవిత, ఎత్తు గీతి, రగడ, ఉదాహరణాలు, అక్కరలు కుమారసంభవమందు కలవనియు నిరూపించినారు.

విభక్తిక్రియాదులలో ప్రాచీన సాంప్రదాయములను, శైలిలోని ప్రాచీనతను వారు సోదాహరణముగ ఎత్తి చూపి నారు. అయితే 'నాయి' వంటి అపపదాలు నన్నిచోడకవి వాడెనన్నారు. మనము నన్నయ కెంతముందుగా పోవుదుమో అంత యెక్కువగా తమిళ కర్ణాటపదాలు తెనుగులో కాన వచ్చును. క్రమముగా అనేక ద్రావిడభాషా సామాన్యపదములు తెనుగులో 'పాతిపడి' మూలబడెను. కెలసము, కెట్టివంటి పదాలట్టివే. నన్నిచోడుని పదాలలో చాలపదాలు తమిళ కర్ణాట భాషాసహాయముచే విడదీయవలసియుండును. మానవల్లి కవిగారటులే సమంజసముగా చేసిరి.

నన్నిచోడకృతిలో అరసున్నలు నిండుసున్నలుగా వాడ బడినది ముఖ్యముగా గమనింపదగినది. వాండిడె, పోండిమి, మూాండవ అని ప్రాసస్థానములో వాడినదియు గమనింపదగినది.

వస్తుకవితలో తన కాలమును గూఢముగా కవి తెల్పి నది తర్వాతవారి కనుకరణయోగ్య మయ్యెననియు, సోమ నాథుడు, విన్నకోట పెద్దన, చిత్రకవి సింగరార్యుడు తమను గురించి యటులే తెలుపుకొనిరనియు నిరూపించినారు.

వీరి వాదము సహేతుకముగా కానవస్తున్నది. గొప్ప

పరిశ్రమచేసి తమ యుపజ్ఞచే నూతన విషయములను తెలిపి ఆంధ్రభాషాచరిత్ర కుపకరించిన శ్రీ రెడ్డిగారి పరిశోధన అత్యంత ప్రశంసనీయము, సమాదరణీయము.

—గ్రంథాలయ సర్వస్వము
(జూన్, 1953 సంచిక)
(27—28 పుటలు.)

మరిగొకటి—

'సీనింబట్టి శాసనాధారములచే నన్నెచోడుని గుర్తించుట ఎట్లు కుదురదో అట్లే కృతిపతియైన మల్లికార్జున మునిని కూడ గుర్తించుట కష్టమే. అట్లుండియు కొందఱు ఈ క్రింది పద్యమునుండి కొంత సాధింప యత్నించిరి.

చ. గురువున కిష్టదైవమున
కుం బతికిం గృతిచెప్పి పుణ్యముల్
వడయును దేజముం బడయ
వచ్చు జగంబుల నిశ్చయంబు, మ
ద్గురువును నిష్టదైవమును
గూర్చు నిజేశుఁడు దాన, నాకుఁ గా
కొఁగనకు నిట్టు లెకుఱునె
నొక్కట లాభము లెన్నియన్నియున్.

గురువు జంగమ మల్లికార్జున యోగియనియు ఇష్టదైవము శ్రీశైలమునందలి స్వామియనియు ప్రభువు శ్రీగిరి ప్రాంతమందలి మల్లపరాజు అనఁగా పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన త్రైలోక్య మల్లాహవమల్ల భూపాలుఁడనియు

శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు పై పద్యముచేతను బంధ కవిత్వ చిత్రకవిత్వాదులను బట్టియు కొన్ని పద్యముల యందలి అక్షరసాంఖ్యాది గణితముచేతను తారీఖు లూహించి నిర్ణయింపఁ బ్రయత్నించినారు. వీరు చాలవఱకు నూతన మార్గమును త్రొక్కి చిత్రకవిత్వ బంధకవిత్వాది విశేషములను వెలికి లాగిరిగాని ఒక్కటి దీనిని బాధించుచున్నది.

* * *

శ్రీ రెడ్డిగారివలెనే పలువురు పద్యార్థ మూహించి యుండిరిగాని ఇది వారికి తోఁచలేదని నా భావము. పైఁగా ఈతఁడు ప్రాచీన కవియనుటకు ప్రబల (భాషా) నిదర్శనము లుండుటచేతకూడ ఈ తారీఖు ఏర్పడదు.

* * *

మఱి యీ కవికాల నిర్ణయమున కేమి మార్గము ? ఈతని గ్రంథమే.'

—ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి రెండువేల రూప్యముల బహుమతి నందినది. నన్నెచోడుని కవిత్వము.
(12—13 పుటలు)
(1959)

వేరొకటి—

'నన్నిచోడకవి చరిత్రలో అజ్ఞాత వస్తువును వెలుగులోనికి తెచ్చిన గౌరవము మీదే. 'విశేషాంశములు' అన్న మెత్తని పేరుపెట్టి మీరు ప్రచురించివుంటే దుమారము రేగెడిది కాదేమో! పద్యాంతర్గతవస్తువును తెలివిగా ఉపయో-

గించు నువ్వు మననాటచే మీ యత్నమూ గుర్తింబడియుండును. ఇప్పుడు గుర్తింపబడలేదనికాదు నా సూచన. వ్యక్తులు మనస్సులో నిల్చి, అభిప్రాయాలూ సాక్ష్యాలూ ఆ వ్యక్తి నీడలోనికి దూర్చబడడము అతి సామాన్యమైపోయింది నేడు. రచయితపట్టిన కొత్తవస్తువును రచయితే ఆనందించుకోవలసిన దుస్థితి నేటిది. కాని, ప్రాజ్ఞులూ సారస్వత తపస్వులూ మీరు ఈ చిన్న అసడ్డను అడ్డురానీయక మీ సాహిత్య వ్యవసాయాన్ని సాగిస్తారనే నమ్ముతాను.

—శ్రీపాద గోపాలకృష్ణమూర్తి
(29—1—60 కవర, నెల్లూరు.)

ఇక భాషాచరిత్ర భవిష్యత్తెట్టిదో చర్చింతము.

---

## తెంకణాంధ్రులు

తెలుగు దేశభాషాచరిత్రను చారిత్రకముగా నిర్ణయించుట కాధారము లున్నవేమో చూతము.

'ఎట్లన నీ మెత్పదము ('ఎత్'భాష) స్వరాది హలంత వాఙ్మయదశలో 'ఎత్' అని యుండ, క్రమముగా 'ఎత్—తెన్—తెనున్—తెనుఙ్గు—తెనుఁగు అని రూపమునొందిన దనుట.'

—శ్రీ కొసరాజు బసవయ్యవిద్వాన్‌గారు
(తెనుగు వనము, 26—27)

'మన పురాణములు ఆంధ్రులు రెండు ప్రదేశములలో

('ఆంధ్రాశ్చబహవః' భారత. VI 9-49) నుండినట్లు వర్ణించి యున్నవి.

మొదటిది దక్షిణాపథము

'తుంగభద్రాంధ్రి (ప్రాచీన 'అంధ్రి'). మనఫూర్వులు ఇచ్చటివారే.

(రెండవది ఉత్తరాపథము)

'—నేటి యూప్ఘనిస్థానమునకు ఉత్తరమున బాహ్లిక మునకు ప్రక్క. (ప్రదేశము).

'గిల్జాయిలోని అంధేరి లేక ఆంధ్రి (జాతి) : శాఖ— అంధఖుయి (నేటి జిల్లా).

—శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు
(చరిత్ర రచన, 32...37)

'ఆంధ్రపదము ఐతరేయమను ఋగ్వేద బ్రాహ్మణము నందే మొదటిమారు కానవచ్చును. బౌద్ధవాఙ్మయములో 'అంధకు'లను గురించిన ప్రస్తావము కలదు. 'సమంతపాసాదిక' అను బౌద్ధగ్రంథములో 'దమిళు'లతో పాటు 'అంధు'లుకూడ మ్లేచ్ఛులుగా పేర్కొనబడిరి. 'అంధులు' 'అంధకులు' ఒక్కరే కావచ్చును. బౌద్ధగ్రంథమువలన గోదావరితీరమున 'అంధ కరట్ఠ' (అంధ్రరాష్ట్రి) మొకటి కలదని, 'అస్స'కులు, 'అళ' కులు (మొళకులు) అంధ్రరాజులని తెలియుచున్నది. బుద్ధుని

కాలమునాటికే గోదావరీతీరమున ఆంధ్రజనపథము లుండినట్లు విశదమగుచున్నది.

—శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు
(తెలుగు సంస్కృతి. 1 పుట.)

'మన భరతఖండమందుఁ గాశ్మీరప్రాంతమునం బూర్వమందు నాంధ్రులను పేరుగల ప్రాచీన మానవసంఘము ప్రాకృత భాష మాతృభాషగా గలిగియుండె'

—శ్రీ కొసరాజు బసవయ్య విద్వాంసుగారు
(తెనుగు పసము, 26—31 పు.)

'తెంకణాదిత్య' యను బిరుదమున కర్థమును గురించి పలువురు పలు తెఱంగులు అభిప్రాయపడుచున్నారు. 'తెంకణమునకు సూర్యునివంటివాఁడు' యనునర్థము బిరుదమునుండి తీసినయెడల 'తెంకణ' యనుమాట యొక దేశవిభాగము యొక్క నామధేయముగునను యూహ పొడముచున్నది.

నిజముగనే రాయలసీమయందలి కొన్ని శాసనములందు ఇయ్యది యొక దేశవిభాగ నామముగనే పేర్కొనఁబడియున్నది. గుత్తితాలూకా తాడిపత్రి రామేశ్వరస్వామి గుడియందలి శా. శక. 1130 కాళయుక్తి సంవత్సరపు—కలుకడపురాధీశ్వరుఁడగు నుదయాదిత్యదేవుని శాసనము (దక్షిణహిందూదేశ శాసనములు సంపు. IV నెంబరు 798. ఈ శాసనమును నా దృష్టిగోచరమునకుఁ దెచ్చిన శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారియెడ కృతజ్ఞుఁడను.)—శాసనమందు తాడిపత్రి ఆంధ్రదేశమునందలి తెంకణాధారిణియందొక

దేశవిభాగము పెన్న పరినాడులోని ముఖ్యగ్రామ మని వర్ణింపఁబడియున్నది.'

—శ్రీ మల్లూరు వెంకటరామయ్యగారు
(తిలింగ రాజతోత్సవ సంపుటము నుండి పునర్ముద్రితము, 9 పుట.)

'శేరి' రాజ్యంలో బోధిసత్త్వుడు 'తేలవాహా' నదిని దాటుకొని 'అంధాపురం' ప్రవేశించడము జరిగింది.

—శ్రీ హెచ్. ఆదినారాయణగారు
(జాతకకథలు చందమామ, 12 సం. 4—12)

ఇట్లు పూర్వవాదము లున్నను, తెలుగు భాష జన్మస్థాన మేదో నిశ్చయము కాలేదు.

బౌద్ధ జాతకకథలో పేర్కొన్న 'శేరి' రాజ్యమేదో తెలియకపోయినను, 'తేల'వాహానది ప్రాంతమందలి 'అంధాపురం' చరిత్రను గుర్తించినచో గోదావరినది కుపనదియైన శబరికి 'తెల్' నది ఉపనదిగా కనబడుచున్నది. సోనపూర్ ప్రాంతమందలి 'సుక్తెల్' నదిలో ఒక పాయ 'తెల్' నది.

తెలుగు ప్రాంతములగు బస్తర్, కోరాపుట్టి, గంజాము ప్రాంతములలో 'తెల్'నదీ ప్రవాహము కలదు. ఇప్పుడక్కడ "అంధాపురం" శిథిలమైనందుచేత కాబోలు గుర్తింపబడలేదు. శిథిలమైనను 'తెల్' భాషకు 'అంధ'భాషకు గల నైసర్గిక సంబంధము నీ 'తేలవాహా' నది ఋజువుచేయగలుగుచున్నది.

'ఉంకి—ఉంకు' ప్రాచీనరూపములకు 'ఉనికి—ఉంకిప', ఉనుకువ—ఉంకువ' అర్వాచీనరూపము లేర్పడినను, 'నివాస'

మను అర్థభేదము లేదు. కాగా 'తెల్ + ఉంకు — తెలుంకు, తెలుఁకు' దేశము ఉత్పత్తిగోచరమై, పిమ్మట 'తెలుంగు, తెలుఁగు' జాతిభాష సిద్ధించును. 'తెల్' నదీప్రాంతమే 'ఉంకు' (నివాసము)గా కలవారు తెలుంకులు — తెలుంగులు — తెలఁగాలు.

తెనుగుభాషలోనున్న 'తెల్ — తెన్' పేర్లు ఉత్తర దక్షిణదిక్కులకు జాను తెనుగురూపములన వీలున్నది.

'తేలవాహ' ప్రవాహనామమే వాల్మీకి కాలములో 'టెంకణ్ వాహ'గా ఉండెడిదేమో తెలియదు. వాల్మీకి కవి 'టెంకణ' ప్రదేశమును ఆదికావ్యములో పేర్కొన్నాడు.

బౌద్ధజాతక కథలనాటికది 'తెల్' నామముతో ప్రసిద్ధమైనది. దేశపటములో 'తెల్ (Tel)'నది పేరున్నది. 'టెన్ + కడ' అర్వాచీనరూపమే. 'టెన్ + కణ' ప్రాచీనరూపమై 'టెంకణ — తెంకణ' ప్రసిద్ధిపొందినది. ఈ 'కణ — కడ' రూపాంతరములు 'అణకువ — అడకువ' పర్యాయపదములనంటివి. 'కణ — కడ — స్థానము; లేక, నివాసస్థానము.

'తెన్ + కణ — తెంకణము.' తెల్ నదీస్థానమే కణ(కడ)గా కలది 'తెల్కణము' కావలసియున్నది కాని, అట్టి రూపము లేదు; 'తెలగాణ' పేరు కలదు. తెలగాణ్యం జాతి కలదు. ఇది 'తెలుంకు — తెలుంగు' రూపాంతరమైనది. తెల్ నదీస్థానమే ఉంకు(వ)గా కలది తెలుంగుజాతి; భాష.

తెంకణ భారతదేశమందు తుంగభద్ర 'హంద్రి' నదీ ప్రాంతమె 'తెంకణాధారిణి—ఆంధ్రదేశము' కాబోలన్నట్లే, గోదావరి శబరి 'తేలవాహ' నదీప్రాంతమె 'తెలుంకు—

అంధాపురము' సంబంధము తెల్పుచున్నది. దురదృష్టవశాత్తు 'తెలుంకు' జాతి నివాసస్థానమైన కోరాపుట్టి, గంజాము, బస్తర్ ప్రదేశములు, తెల్ వాహా నదీప్రాంతము, ఆంధ్ర ప్రదేశ్‌లో చేరక ఒరిస్సాలో చేరుట శోచనీయము.

పురాణాదులలో పేర్కొన్నట్టి 'అప్ఘనిస్థాన అంధఖుయి' ప్రాంతమందలి 'అంధేరి' జాతి ఆంధ్రులు తత్ప్రాంత మ్లేచ్ఛులతో చేరి మ్లేచ్ఛులై నప్పటికిని, తదన్యప్రాంతమందలి 'అంధకాంధ్రులు' జాతిభ్రష్టులుకారు. ఈ అన్యదేశాంధ్ర మ్లేచ్ఛపదములు కొన్ని శుద్ధాంధ్రములో చేరినవనుట ప్రాచీన భాషా సంబంధము.

త్రినగ, త్రిలింగ, త్రికళింగ శబ్దములనుండి 'తెనుంగు— తెలుంగు' భాషానామ మేర్పడలేదనియు, ఎత్ భాషనుండి కూడ కలుగలేదనియు, 'తెల్' నదీ ఉంకువనుండి పుట్టిన జాతి భాష 'తెలుఁగు' అయినదని తోచుచున్నది.

---

## గ్రహకాలములు

కిన్నెర (1954 సం. మార్చి—ఏప్రిల్) సంచికలలో 'నన్నెచోడదేవ దేశికవి' కాలాదులు చర్చించుచు శ్రీ శేకుమళ్ల కామేశ్వరరావుగారు తమ వాదమున కనుగుణముగా గ్రంథాదియందలి 'సత్కవి బుధ గురు బలము'తో చోడకవి జన్మకాలమును నిర్ణయింప కడంగినారు. శ్రీ రావుగారి యూహాచరిత్ర కంతయు మూలాధార మీకాలముగా కనబడుచున్నది. కాబట్టి, ఇందలి సాధకబాధకములను చర్చించడము ముఖ్యము.

"నన్నెచోడుని 'అన్యతారకవుల' పద్యం చదివితే దానిలో అతను తన జన్మ గ్రహాదికములనుగూడ చెప్పకొన్నా డనే అనుమానం తట్టకమానదు. ఆ గ్రహాలు సత్కవి బుధ గురుగ్రహాలు. దీనిలో అతని జన్మకాలం కూడ ఉందా!

*  *  *

"—నన్నెచోడుడు ఈ (కాలచుర్య — హైహయ) శకాన్ని తన పద్యంలో చొప్పించేడేమో చూద్దామని పరిశ్రమ చేసేను. 'అన్యతారక' పద్యంలో చెప్పబడ్డ గ్రహాల స్థానాలను లెక్కించి ఆచారప్రకారం ఆ సంఖ్యను తలక్రిందుచేసి కాల చుర్య శకంలో ఏ సంవత్సరమవుతుందో చూసేను. ఎట్లంటే— జ్యోతిశ్శాస్త్రంలో గ్రహముల వరుస 1. ఇన, 2. శశి, 3. కుజ, 4. రాహు, 5. జీవ (గురుడు), 6. మంద, 7. జ్ఞ (బుధుడు), 8. కేతు, 9. భృగు(శుక్రుడు). కవి బుధ గురువులు. పై వరుసలో వీటి స్థానాలు 9,7,5 కాబట్టి వీటిని అట్లు(తలక్రిందు)చేయగా 579 అయింది. ఇది (తన తల్లి వంశం) కాలచుర్యశకం తాలూకు సంఖ్య. దీనిని క్రీస్తుశకంలోకి మార్చాలంటే (ఒక గ్రంథములో సూచించినట్లు) 249 చేర్చాలి. అప్పటి కిది క్రీస్తుశకం 828 అయింది. నేను అనేక ఉపపత్తులతో నన్నెచోడుని జన్మ సంవత్సరం ఆ ప్రాంతంలోనే ఉంటుందని చెప్పిన సంవత్సరానికి సరిపోయింది. కాబట్టి నన్నెచోడుని జన్మ క్రీస్తుశకం 828 అని భావిస్తున్నాను. నన్నెచోడుడు కమ్మచ్చులోంచి లాగినట్లు పద్యాలు వ్రాయగలడు. అటువంటివాడు అన్యతారకవుల పద్యాన్ని ఎగుడుదిగుడుగా వ్రాయడం దానిలో అనేక అర్థా లను ఇమడ్చడానికి పడ్డ శ్రమే అని తోస్తుంది.

"క్రీస్తుశకం 829 ప్రాంతంలో గుణగుడు జన్మించి ఉంటాడని నా వాదం కాబట్టి పైనిచెప్పిన (చిత్రభాను, విజయ) సంవత్సరాల పేర్లు గుణగుని పుట్టుక, బాల్యానికి సరిపోవు. కవి ఆ సంవత్సరాల పేర్లను ఇట్లు (కాలచుర్య శకకాలముతో) ఐక్యపరచలేదనే చెప్పనలసి వస్తూంది."

—కిన్నర

ఈ వాదములోని పొరపాటును చక్కదిద్దితే దైవజ్ఞ కవి గణిత చమత్కారం బోధపడుతుంది.

'అన్యతారక వితతుల – నాదరించి
వెలయు సత్కవి బుధ గురు – బలము పడసి
యొనర దైవజ్ఞు నట్లు శు – భో దయముఁ
దివ్యసుకృతిఁ బ్రతిష్ఠింతుఁ – దిరముగాఁగ.'

ఇది చోడకవి ప్రతిజ్ఞ. దీనిలో సత్కవికిని—దైవజ్ఞునకును సమాన ధర్మంగా శ్లేష చెప్పబడినది. ఇంతటితో దీనిని విడిచిపెడితే, ఇందలి కవి ప్రతిజ్ఞాపాలనకాలము బోధపడదు.

ముందిక్కడ నవగ్రహ దృష్టి కోణసంఖ్యా లేకాలమును సూచించుచున్నవో లెక్కించి, తరువాత ఆ నవగ్రహ క్రమ సంఖ్యాకాలమును సిద్ధాంతముచేయడం తుల్యతారకము.

'సత్కవి బుధ గురు దృష్టి బలము' జ్యోతిశ్శాస్త్ర మర్యాద ననుసరించి 7 శుక్ర 7 బుధబలము–సమసంఖ్యలుగాను, 579 గురుబలము – భిన్న సంఖ్యలుగాను భేదించుచున్నది. ఈ మూడు గ్రహాలు సమదృష్టి కోణాలను చూచుచున్నవను పక్షంలో ఇవి 777 సమ సంఖ్యలను, 59 దృష్టిదోష సంఖ్యలను

స్ఫురింపజేయుచున్నవి. శేషదోషమును వర్జించినచో ఇది శాలివాహన శకము 777 కాల మగుచున్నది.

క్రీస్తుశకమునకును — శాలిశకమునకును మధ్యకాల వ్యత్యాసము 78 సంవత్సరాలు కలవు కనుక, ఈ వ్యత్యాసమును శకకాలముతో కలిపి కూడవలసి యున్నది. కాగా, ఇది శాలివాహనశకము 777 సంవత్సరమునకు సరియగు క్రీస్తుశకము 855 సంవత్సర కాలమగుచున్నది. కాలచుర్య శకకాలముతో దేశాచార విరుద్ధంగా లెక్కించిన క్రీస్తుశకము 828 కాలముకంటె శాలిశక కాలముతో దేశాచారముగా లెక్కించిన క్రీస్తుశకము 855 కాలము శ్రేష్ఠమైనది: ఇది చాళుక్య గుణగ విజయాదిత్యుని క్రీస్తుశకము 848–91 సమకాలముగా కూడ ఉన్నది. కుమారసంభవ కథలో గూఢ వస్తుమయముగా చాళుక్యరాజు గుణగ విజయాదిత్యుని యుద్ధచరిత్ర కూడ కలదన వీలున్నది. అయితే, విమర్శకులుదాహరించిన 'ఇనశశి—క్రమేణ' అను నవగ్రహ క్రమ సంఖ్యాబలముమీాద ఆధారపడక, నేను సూచించిన నవగ్రహ దృష్టిబలము మీాదనే ఆధారపడవలసి యుండును.

"పైని చెప్పిన (చిత్రభాను, జయ) సంవత్సరాల పేర్లు గుణగుని పుట్టుక, బాల్యానికి సరిపోవు. కవి ఆ సంవత్సరాల పేర్లను ఇట్లు ఐక్యపరచలేదనే చెప్పవలసి వస్తూంది." అని శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు సిద్ధాంతంచేసి తృప్తి పడినను, గణితజ్ఞులు గణిత చమత్కార సత్యమును పరిశీలింపనిదే తృప్తిపడ వీలులేదు.

తుల్యతారకతతులు అనాదరింపబడినను, భిన్నతారక తతులు ఆదరింప వీలున్నదేమో లెక్కించి చూతము.

కవి చమత్కారముగా పేర్కొన్న గ్రహముల దృష్టి నీచ దృష్టి కాదని తలచిన పక్షంలో 779 ఉచ్చదృష్టి, 57 నీచ దృష్టి లభించుచున్నది. గురుబలంలో 57 శేషము మిగులు చున్నది. పోగా, ఇందలి 7 కవి 7 బుధ 9 గురుబలము వామ గతిగా—తలక్రిందుగా మారిన 977 శకకాలము లభ్యమగు చున్నది. ఇది విక్రమ శక కాలమన్న క్రీస్తుశకము 722 సంవత్సర మును; కాదని, శాలిశక కాలమన్న క్రీస్తుశకము 1055 సంవత్సర మును కాలవ్యత్యాసమునుబట్టి ఏర్పడుచున్నవి. ఇది కథలో కవి ఉత్ప్రేక్షాలంకారముగ పేర్కొన్న 'జయ—కాదని నాటుదిరి విస్ఫుర దవదాత ఖడ్గలత పూచెనో నా జయచైత్ర సంపదన్.' అను కాలముతో నీమద్భేదముగా సరిపోవుచున్నది.

అలంకారమందలి 'స్ఫురత్—విజయచైత్ర సంపద' కవి ప్రతిజ్ఞయందలి శాలివాహన శకము 977 కాలముతో చక్కగా సరిపోవుటలేదు. ఈ శక కాలములో రెండు సంవత్సరముల కాల దోషమున్నది. ఇది మన్మథ సంవత్సర కాలముగా కనబడు చున్నది. విజయ కాదు.

ఈ గణితములో మరియొక చమత్కార సమన్వయ మున్నదని కూడ కవి ప్రతిజ్ఞ చెప్పక చెప్పుచున్నది.

ఈ గీత మందలి, 'సత్కవి బుధ గురు బలము' శాస్త్ర విధి ననుసరించి 77 శుక్ర బుధ బలముగాను, 579 గురుబలము గాను విభాగించ వీలిచ్చుచున్నది. 579 గురువునకు 77 శుక్ర

బుధులు శత్రుకోటి గ్రహసంఖ్యలు, కాగా, ఈ 77 తుల్యతార కతతులు అనాదరింపబడినను, మరల ఆ 579 భిన్నతారకతతులను ఆదరించుటలో కాల దోషములేదు. అంటే సత్కవి బుధ బలము (77) లేకనే, గురుబలము (579) ఒక్కటే చోడ కవి కాలమును సాధించుచున్నదనుట. ఈ 579 గురుబలము సంఖ్య వామగతిగా మారి సంప్రదాయ ప్రకారము శాలివాహన శకము 975 సంవత్సరమునకు సరియగు క్రీస్తుశకము 1053 సంవత్సర విజయ సంవత్సర చైత్ర మాస సంపదను నిరూపించుచున్నది.

ఒకపక్షములో 57 శేషము, మరియొక పక్షములో 77 శేషము మిగులుచున్నను, ఇవి స్థూలసూక్షముగా విక్రమ శకకాల వ్యత్యాసమును, శాలిశక కాలవ్యత్యాసమును స్ఫురింపజేయుచున్న వనుట గణిత సిద్ధాంతమైనను, క్రీస్తుశకము 11 శతాబ్దములో చోడకవి కాలములో క్రీస్తుశక కాల విజ్ఞానము భారతదేశమున కలదో లేదో చారిత్రకులు పరిశోధించి నిర్ణయింపవలసి ఉన్నది. క్రీస్తుశక కాలమునకును, శాలివాహనశక కాలమునకును మధ్య 78 కాలవ్యత్యాసము కనబడుచున్నను, కవి గణితములో 77 కవి బుధబలము మాత్రమే శక కాల వ్యత్యాసముగా కనబడుచున్నది.

"........Add 77 to the Salivahana year or subtract 57 from Vikramarka year........"

కాలమానబోధ (The Date calculator) లో కీర్తిశేషులు శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులుగారు కూడ పై విధముగా 77 కాలవ్యత్యాసము సూచించి, జనవరి నెలనుబట్టి

ఇంగ్లీషు సంవత్సరములో ఒక్క సంవత్సరము (Increased by 1.) విధిగా కూడవలెనని తీర్మానించియున్నారు. కాగా, కవి గణితములోని క్రీస్తుశకము 1052 మీద వసంతఋతు సమ కాలమునుబట్టి ఒక్క సంవత్సరము చేర్చగా, అది క్రీస్తుశకము 1053 సమకాలమగుచున్నది. క్రీస్తుశకము 1053—1054 సంవత్సరములలో 'విజయ సంవత్సర చైత్రమాస సంపద' వసంత కాలము మార్చి—ఏప్రిల్ నెలలకు సమకాలమగుచున్నది.

ఈ గ్రహదృష్టి బలకాలముతో గ్రహాక్రమ బల కాలము చారిత్రకముగా సమకాలమగునో, కాదో లెక్కించిన కాని సత్యము బోధపడదు.

" ఇన శశి కుజ రాహూన్
జీవ మందజ్ఞ కేతూన్
భృగు రితి చ నవానాం
కృత్తి కాది క్రమేణ. "

దీనిలో నవగ్రహములు, నక్షత్రములు క్రమముగా పేర్కొనబడినవి. జ్యోతిశ్శాస్త్రములో గ్రహ దశాంశ సర్గ ములను లెక్కించి, జాతకుని ఆయుర్దాయాదులు నిర్ణయించుట కీ తుల్యతారకవితతి ప్రమాణముగా ఉన్నది. కాని, ఈ శ్లోక మును క్రింది వక్రోక్తిలో చోడకవి సూచించి, ఇట్లా శ్లేషించి యున్నాడు.

ఇనశశి తేజంబుల జగ
మనిశము విధి నడపు టెంత-యుని వాని మహా
జననీక తారక ప్రభ
జననడపెడి మిమ్ము మిగిలి-సామర్థ్యమునన్.

—(4—24)

కథలో తారకాసురుడు సృష్టికి ప్రతిసృష్టి చేయుచున్నాడనుట సరళ భావము. జ్యోతిషములో సౌరమాన—చాంద్రమాన విధులను నిషేధించి, బార్హస్పత్యమాన విధిని ప్రవర్తింపజేసి కాల నిర్ణయముచేయ వీలున్నదనుట వక్రోక్తి చమత్కార భావము.

ధ్రువమండల ప్రాంతములో సూర్యకాంతి— చంద్రకాంతి ప్రసరింపకనే, ధ్రువ నక్షత్రకాంతితో కాలము నడచుచున్న దనుట వ్యంగ్యభావము. 'ఇనశశి తేజంబుల విధి నడపు టెంత!' అనుట కాదనుటకాదు; వీలున్నదనుట.

ఈ పాదములోని 'ఇనశశి' ప్రారంభము వ్యంగ్యముగా 'ఇనశశి — నవా నాం — క్రమేణ' అను నవగ్రహ క్రమ శ్లోక విధిని వ్యంజకము చేయుటయే కాక, 'తారకప్రభ' కుమార సంభవ జన్మతార 'కృత్తిక'ను కూడ ధ్వనించు చున్నది.

జ్యోతిశ్శాస్త్రమందలి సంప్రదాయ గణిత పద్ధతులను అనాదరించి, యుక్తి గణిత విధులు ఆదరించుట ప్రతారకవి తార్కాణ నిదర్శనము.

కృత్తికాది తారకతతులు అనాదరించి, సూర్యాది తారక తతులు ఆదరించి, శుభోదయ కాలము ప్రతిష్ఠింతుసన్న సంకేత మీా సన్నిచోడకవి ప్రతిజ్ఞాగీతములో వ్యంజకమగుచున్నది.

శ్రీ కొకుమ్మ్ల కామేశ్వరరావుగారు ఈ నవగ్రహ క్రమ సంఖ్యలను ప్రమాణముగా పేర్కొన్నారే కాని, పైని నేను వివరించినట్లు శకకాలమును నిర్ణయించుటలో అన్యోన్య

తారకతతులను గమనింపక, కాలచుర్య శకకాలముగా లెక్కించుట పొరపాటు. కవి కావ్యమందలి స్థూల సూక్ష్మ గణిత కాలాదుల సమన్వయముతో ఈ పొరపాటును సవరించుట చారిత్రకుల ధర్మము.

గీతములోని గ్రహ సంఖ్యలకును, శ్లోకమందలి గ్రహ సంఖ్యలకును క్రమభంగమున్నది.

'వెలయు సద్గురు బుధ కవి
—బలము పతసి (తి)'

లేదా—

'వెలయు సత్కవి బుధ గురు
—బలము పతసి (తి)'

ఈ తేటగీతి రెండు పాదములలో ప్రాసయతి చెల్లినది. గణభంగము కూడలేదు. యుక్తికవి పేర్కొన్న 'సత్కవి 9 బుధ 7 గురు 5 బలము-975 గురు దృష్టి బలము' వామగతి శకకాలము. అంటే, చోడకవి వామగతిగా మార్చిన తల క్రిందు కాలమును, మరల తలక్రిందు కాలముగా మార్చకూడదన్న మాట. శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారీ వంచన కీలకమును గమనింపకనే, కవి కావ్యమందలి శక కాలమునకును ప్రభవాది నామకాలమునకును సమన్వయము లేదని, తమ యూహాగానచరిత్రకు సరిపడు కాలచుర్యశకకాలమును సిద్ధాంతముచేయుట కాలదోషము.

గీతములో యుక్తి కవి ఛందోభంగము లేకనే 'సద్గురు బుధ కవి బలము—579' వ్రాయకలిగియుండియు, అట్లు వ్రాయక తలక్రిందుగా 'సత్కవి బుధ గురు బలము—975

వ్రాయుట సాంప్రదాయ భంగమైనను, మరియొక విధముగా అది వామగతి కాలమును తెల్పుచున్నదనుట సత్సాంప్రదాయము.

'తారక విరచిత కృతియును
దారక విరచిత సుకృతియుం
—దా నతఁగు నదా'

—(10—518)

పై తారకవితతుల గీతములో దుష్కృతి కాలమున్నను, సుకృతి కాలమున్నను మరల నవి సదాచారముగా—సువిచారముగా చూచినచో తమలో తామణగి మణగియుండు ననుట సుస్పష్టము. కథలో ఇది తారకాసురుని దుష్కర్మలును, సుకర్మలును కుమారస్వామిని చూచినంతనే, తమలో తాము అంతరించునను భావమును తెల్పుచున్నది.

'—జయ—కాంతియొ కాదని నాఁటు దీరి విస్ఫుర దవదాత ఖడ్గలత పూచెనొ నా జయచైత్ర సంపదః' (12—181) "సద్గురు బుధ కవి బలము—579 శుభోదయము' కాదంటే-వామగతిగా,

'సత్కవి బుధ గురు బలము
—975 శుభోదయము' కాకపోదు.

కుమార సంభవ కావ్యములో మారాన్వయ వర్ణనలు తార్కాణ కాలములుగా ఉన్నవి. ఇవి కథలోను, అవతారికలోను శ్లేషార్థముల నిచ్చుచున్నను, అవి మరల గణిత సిద్ధాంత కాలమును కూడ వ్యంజకము చేయగలిగి యున్నవి.

రెండు వాక్యములుగా ఉన్న 'స్ఫురత్ వి—జయ చైత్ర సంపద'ను దూరాన్వయ కాలములనుట దోషముకాదు. దీనిలో స్థూలముగా విజయసంవత్సర చైత్రమాస వసంత ఋతు సంపద మాత్రమే కలదన్నను, లేదా—సూక్ష్మముగా విజయ సంవత్సర చైత్రమాసము, అవధాత (శుక్ల) పక్షము, జయ (అష్టమి) తిథి, జయ (మంగళ) వారము, (పుష్ప) 'లత' (పొట్లపూవు–సరళా పుష్యమి) నక్షత్రముకూడ ధ్వనించుచున్న దనుట గణిత సిద్ధాంతము.

ఇట్లు దైవజ్ఞ ప్రతిజ్ఞలో చోడకవి మార్చి కూర్చిన శాలివాహన శకము 975 శుభోదయ కాలమున్నదే కాని, శ్రీ రావుగారు తలక్రిందుగా మార్చికూర్చినట్లు కాలచుర్య శకము 579 శుభోదయ కాలములేదని విజయప్రశస్తి కాల గణితము తెల్పుచున్నది.

ఈ గ్రంథాంతరంగిక కాల సూత్రములు లెక్క-ప్రకారము మార్చి—ఏప్రిల్ క్రీస్తుశకము 1053 తేదీ వసంతకాలమును; లేదా, 30–3–1053 తేదీ పుష్యమీ నక్షత్రకాలమును వ్యంజకము చేయుచున్నవనుట గణిత నిదర్శన చరిత్ర. ఈ శాలివాహన శకము 975 (స్ఫురత్ విజయ చైత్ర సంపద) కావ్యాదిలో వ్యంజకమగుటవల్ల, ఆ 30–3–1053 తేదీ మంగళవారము కుమార సంభవ కావ్య రచనారంభ కాలమే కానీ, కుమార సంభవ కావ్యకర్త నన్నిచోడ కవిరాజశిఖామణి జన్మకాలము కాదు.

దీనిలో 'తారకవి' నామకాలము కూడ సూచితమైనదనుపక్షములో తదక్షర సంఖ్యాశాస్త్రమునుబట్టి క్రమముగా

'తా6 ర 2 క 1 వి 4 (తతి)' సంఖ్యలు కలవనియు, ఆ కలిగతాబ్ద సంఖ్యలు సాంప్రదాయమునననుసరించి తలక్రిందు చేయగా కలి యుగము 4126 గతాబ్దములు లభించుచున్నవి. దీనిలో క్రీస్తు శకము కాలవ్యత్యాసము 3102 వర్షములు పోగా క్రీస్తుశకము 1024 రక్తాక్షి సమకాలమును, శాలివాహనశక కాలవ్యత్యాసము 3180 వర్షంబులు పోగా శాలివాహన శకము 946 రక్తాక్షి సమకాలమును మిగిలి చోడకవి జన్మకాలము వ్యంజకమగుచున్నది.

ఇట్లెన్ని విధముల లెక్కించినను 'అన్యతారకవితతుల' గీతములో వ్యంగ్య గణిత సమకాలముగా శాలివాహన శకము 946 కవి జన్మకాలము, శాలివాహన శకము 975 ప్రబంధరచనారంభ కాలము 29 సంవత్సరముల వ్యవధిగా చెప్పబడినట్లు సిద్ధాంతమగుచున్నది. క్రీస్తుశకము 11 శతాబ్దిలో క్రీస్తుశకము 1024 చోడకవి జన్మకాలము, క్రీస్తుశకము 1053 కుమారసంభవ రచనారంభ కాలము శుభోదయ కాలములుగా చెప్పబడినవి. కవిరాజశిఖామణి నన్నిచోడ రాజు 30 సంవత్సరముల వయస్సులో తత్ప్రబంధరచనారంభము కావించినట్లు తత్ప్రతిజ్ఞ సూచించుచున్నది.

క్రీస్తుశకము 11 శతాబ్దములో శ్రీ భోజరాజ కవిచక్రవర్తి ఆస్థానములో 'తారేన్ద్రి ప్రముఖాః సర్వేసర్వజ్ఞాః' అను 'శాస్త్రి విచక్షణా' కవులును, 'పణ్డితో రామేశ్వర నామా' అను వృద్ధ పండిత కవియు సమకాలికులుగా ఉన్నట్లు భోజచరిత్ర తెల్పుచున్నది. ఇది విశ్వసనీయ కవి చరిత్ర కాబోలన్న క్రీస్తుశకము 11 శతాబ్ద మందలి కుమారసంభవ కథలో కథే

తరముగా చెప్పిన సమకాలిక కవుల చరిత్రకు సమన్వయము కుదురుచున్నది.

ఈ తారేంద్ర ప్రముఖులలో ఇంద్ర కవిని పేర్కొనక 'తారకవి'ని మాత్రమే కుకవిగా చోడకవి పేర్కొన్నాడనుట కవితాస్పర్థ. క్రీస్తుశకము 11 శతాబ్ద మందలి భాషా వివాద యుద్ధములో కవిరాజ శిఖామణికి మిత్రపక్షములో 'శ్రీ రామేశ కవీశ్వరాదులు', శత్రుపక్షములో 'తారేంద్ర ప్రముఖులు' కలరనుట భోజచరిత్ర సమ్మతము.

సర్వజ్ఞులైనను, సర్వశాస్త్ర విచక్షణులైనను తారేంద్ర ప్రముఖులు దోషాన్వేషకు లగుటవల్ల కుకవులు కాకపోరుకద! ఈ తారకవి భోజరాజాస్థాన కవి యగునేకాని, చాళుక్య రాజరాజనరేంద్రుని ఆస్థానకవి, తారకపురి (తణుకు) నివాసి తారకవి నన్నయభట్టు కాడు. కాకపోయినను, భారత కవి తెనుగుభారతములో 'కలి కాలదోషము'లు వర్ణించు వ్యాజముతో కరికాలవంశజుడైన నన్నిచోడుని ప్రబంధ దోష తతులను నిబద్ధ బుద్ధియై తిరస్కరించిన ట్లుదాహరణము కలదు.

'అనుబంధక(లి) రి కాలజ దోష తుషార సంహతిం దన (కృతి) యుదయ ప్రభాతమున దవ్వుగ జో (పి)పె. . . నిబద్ధ బుద్ధియై.' —(ఆది. ఆ. 1, ప. 5.)

ప్రబంధ మందలి కరికాలచోడ వంశజుని దోష సమూహములను తిరస్కరించుట శబ్దశాసన నిబద్ధ బుద్ధితో కాని, కేవలము ఈర్ష్యతో కాదు.

ఇది ధ్వని ప్రధానమైన సమకాలిక కరికాలజకవి కుకవి నింద కాదంటే, అదియు సమకాలిక తార(క)కవి కుకవి నింద కాదనవచ్చును.

అన్యోన్య తారక్యాణ కాలములు అనాదరించినచో కవి ప్రతిజ్ఞలో గ్రహ శుభోదయకాలము లేదన వీలున్నది. కాని, మరల నా ఉదాహరణకాలములను అన్యోన్య తారకముగా ఆదరించినయెడల దైవజ్ఞ కవి ప్రతిజ్ఞలో గ్రహ శుభోదయ సమకాలము కూడ కలదనుటకు వీలున్నది.

ఇంతవరకు విమర్శకు లెవ్వరు పేర్కొనియుండని నూతన గ్రంథాధారమును కనిపెట్టి, చాలమట్టుకు చక్కగా లెక్కించిన శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావుగారికి ధన్యవాదము లర్పించుట నా విధి. వారిచ్చిన కాలదోషములను విమర్శించినందుకు శ్రీ రావుగారు నన్ను క్షమింతురని విశ్వసించుచున్నాను.

నా నన్నిచోడ కవిచరిత్రలో ఈ దైవజ్ఞ కవి శుభ గ్రహకాల గణితము చర్చింపక పోయినను, అయ్యుదయనగ గీతమందలి 'దశ+...శత+దశశత' శ్లేష సంఖ్యలతో 'స్ఫురత్ విజయచైత్ర సంపద' విక్రమ శక సమకాలము స్థూలముగా లెక్కించి, వి. శ. 1110 కి శాలివాహనశకము 973½ ఉత్తరాయణ కాలము అర్ధ సంవత్సర కాలదోషముగా క్రీస్తు శకము 1052-53 సమకాలమని గణిత నిదర్శనములతో నిరూపించి యున్నాను.

ఇప్పు డీ దైవజ్ఞ కవి ప్రతిజ్ఞా గీతములో 'సద్గురు బుధ కవి బలము 579 గ్రహ క్రమ సంఖ్యాబలము' యుక్తివంచన

సుర్మారణుణార్థము తలక్రిందైన 'సత్కృపి బుధ గురు బలము 975 గ్రహ విక్రమ సంఖ్యాబలము'గా కనబడుచున్నదనుట వామగతి సంఖ్యాక్రమ సంప్రదాయమే కాని కాలదోష మున్నట్టిదని కాదు. చోడకవి యుక్తిగా మార్చిన తలక్రిందు కాలమును గమనింపక, మరల దానిని తలక్రిందుగా మార్చుట సత్సాంప్రదాయము కాదు.

కొన్ని తెనుగు శాసనములలో సరుసగా చెప్పినట్లు 'తొమ్మనూట డెబ్బయి అయిదు' అని చెప్పుట, తెనుగునాటి కాల సాంప్రదాయమన్నను కాలదోషము లేదు.

ఇట్టి గీతమందలి ద్వైపక్షి కవి ప్రతిజ్ఞా కాలము చారిత్రికముగా శాలివాహనశకము 975, క్రీస్తుశకము 1053 ప్రబంధారంభ శుభోదయకాలమును, 'మల్లయ—తత్ప్రభు' అను కృతిపతి సమకాలమును సిద్ధాంతము చేయుచున్నదే కాని, కొందరూహించినట్లు క్రీస్తుశకము 848–891 చాళుక్య గుణగ విజయాదిత్య పరమమాహేశ్వరుని కాలమును కాని, క్రీస్తుశకము 928–934 రాజసల్కి యుద్ధమల్లుని కాలమును కాని సూచించుట లేదు.

కథలో కథేతర వ్యంగ్యముగా చోడకవి పేర్కొన్న 'సోమ మనుష్య రూప — మల్లికార్జునన్ — త్రైలోక్య ప్రాజ్యున్' క్రీస్తుశకము 11 శతాబ్ది మధ్యకాలములో 'సోమేశ్వర త్రైలోక్య మల్లు' అను కర్ణాట చాళుక్యరాజని చెప్పుటకంటె గత్యంతరము కనబడలేదు. కల్యాణి పశ్చిమ చాళుక్యరాజులు తమ దానశాసనములలో స్వనామము నుదహరింపకనే, కేవలము 'మల్లప్రభు' బిరుద నామములనే పేర్కొనుట శిష్టాచారమై

యున్నది. వేంగీ తూర్పు చాళుక్య రాజుల శాసనములలో 'విష్ణువర్ధన' బిరుదనామము నుపయోగించుటయే కాని 'మల్లప్రభు' బిరుదనామ మును ప్రయోగింపరు. సల్కి నామాంతరము గల చాళుక్య ... మల్ల ప్రభు బిరుదము ధరించియున్నాడు. ... సల్కి తాత మల్లప రాజు కూడ యుద్ధమల్ల ప్రభు బిరుదు వాడుకొని యున్నాడు. కాని, ఈ తూర్పు చాళుక్య మల్లయ్యల కాలము క్రీస్తు శకము 10 శతాబ్ది కాలమగుచున్నదే కాని, కవి గ్రంథ మందలి క్రీస్తు శకము 11 శతాబ్ది కాలము కాదు.

క్రీస్తుశకము 11 శతాబ్దిమందలి 'ఉదయాద్రిప్రభు', 'కనిగిరి పతి' తెంకణాదిత్యకవి పాకనాటి రాజ్యములో సార్వభౌమాధి కారము వేంగీ చాళుక్య-కళ్యాణి కర్ణాట చాళుక్య రాజుల యుద్ధ జయాపజయములతో తారుమారగుచున్నట్లు చారిత్రకు లూహించుచున్నారు. కవివంశీకుడు 'కందుకూరి పురవ రేశ్వర'అను పాకనాటి విషయాధిపతినని చెప్పుకొనియున్నాడు.

ఆ కారణముచేతనే కాబోలు కావ్యావతారికలో శ్రీగిరి మల్లయ స్వామిని, శ్రీగిరి మల్లయ గురువును వాచ్య ముగా చెప్పి, శ్రీగిరి మల్లయ ప్రభు నామమును చల్లగా జారవిడిచి, కథలో కూడ 'త్రైలోక్యమల్లున్'అని వాచ్యముగా పేర్కొన సాహసము లేక యుక్తిగా 'త్రైలోక్య పూజ్యున్' అని మారుపేరు ప్రయోగించినాడనుట పాకనాటి కవి క్లిష్ట పరిస్థితి. అయినను, సామంతకవి పై వర్ణనతో సంతృప్తి చెందక, యుక్తిగా 'సోమ—మల్ల' వ్యక్తి బిరుదనామములు రెండు మూర్తి యొక్క పద్యములో వ్యంజ

కము చేసియున్నాడు. ఇది 'సోమేశ్వర త్రైలోక్య మల్లు' వ్యక్తి బిరుద నామములను రెంటిని సంగ్రహముగా స్ఫురింప జేయుచున్నది. ఇందలి 'సోమ మనుష్యరూపు' డెవడో గుర్తింపని యెడల 'మల్లయ—తత్ప్రభు—సత్కథాధిపతి' చరిత్ర బోధపడదు. కనుక విజయాదిత్య మల్లపతికిగాని, యుద్ధ మల్ల పతికి గాని 'సోమ' రాజను బిరుదు కాని, వ్యక్తి నామము కాని లేదు. కాగా, ఈ పూర్వ చాళుక్య రాజు లిద్దరు కృతి పతులు కానేరరు.

"సోమ మనుష్యరూప ఘూర్జటి మునిముఖ్యలోక గురు జంగమలింగము మల్లికార్జునన్."

*　　　*　　　*

"త్రైలోక్య పూజ్యాన్"

'తత్ప్రభు నాజ్ఞ పెంపునన్'.

ఇందలి 'సోమ—మల్ల—ప్రభు' సంగ్రహ నామమును గుర్తింపనిచో కృతిపతి నిర్ణయము చేయలేరు. శ్రీ శైల ప్రాంతపు ములికినాటి కధిపతి మొదటి సోమేశ్వర త్రైలోక్య మల్లు కాగా, అయ్యుదయాద్రి—కనిగిరి-కందుకూరు ప్రాంతపు పాకనాటికధిపతి సత్కవిభువి నన్నిచోడుడు కాగా, తత్ప్రాంతపు రాజాధిరాజు తూర్పు చాళుక్య ప్రభువగునో, పడమటి చాళుక్య ప్రభువగునో క్రీస్తుశకము 11 శతాబ్ద మధ్యకాల చరిత్ర సంపూర్ణముగా తెలియని దే చెప్పలేను. అంతవరకు పూర్వకవి సూచించిన దేశచరిత్రను సందేహింప వీలులేదు.

---

# కృ తి ప తు లు

తెంకణాదిత్య బిరుదాంకితుడగు కవిరాజ శిఖామణి కాల మా తెనుగుచోడుని కుమారసంభవమందలి ప్రయోగ భాషా పరిణామకాల చరిత్రతో భాషా తత్వవేత్తలు నిర్ణయింప పూనుకొన్నను, అందులోకూడ రెండుపక్షములు కలవు.

జాను తెనుగు కుమారసంభవమందలి భాష అత్యంత ప్రాచీనమైన దనియు, కానేకాదు; అత్యం తార్వాచీనమైన దనియు తద్భాషాచరిత్ర తెల్పుచున్నదనుట వివాదాంశము. అర్వాచీన వాదము—

'కన్నడకవులు కథానాయకునికిని కృతిపతికిని అభేదము గా కల్పించినారు, గ్రంథమందంతయు నిర్వహించినారు. ఈతఁడు ఆశ్వాసాద్యంతములలోను శివుడు ప్రత్యక్షమైన సన్నివేశములందును, స్తోత్రసమయములలోను చేసినాఁడు. తెనుఁగు లోనికి, కన్నడమును పఠించి గ్రహించినట్లును తెనుఁగున కొంత మార్చినట్లును సువ్యక్తము. కథలో నడుమ నడుమ కన్నడకవులు శ్లేషచేతను ధ్వనిచేతను వ్రాయుచుండిరి. చోడుఁడు కథాంశములలో కలుపలేదు. అట్టి యుద్దేశమును ఈతనికి లేదు.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (219 వుట)

కథలో శివుడు పెండ్లికొడుకై పురప్రవేశోత్సవము చేయునప్పుడు అతనిని పురస్త్రీ లేమని భావించిరో పరికింపుడు.

వ. — — పరమేశ్వరుండు తత్పురప్రవేశంబు సేయు నవసరంబున — —
— (కు. సం., 8—47)

చ. 'విభ్రమగతి వచ్చి చూచె నొక
భామిని జంగమ మల్లికార్జునుఁ.

తే. 'మగువ జంగమ మల్లయ - దగిలి చూచి
యంత కన్నులు మనమును - నంటియున్న
నచల భావన నిల్చె దా - నట్ల పరము
నభవుఁ గని జను లచతాత్మ - లగుట యరుదె.

తే. 'ముడువ నెత్తిన పువ్వులు - ముడిచికొనఁగ
మఱచి చేఁబట్టికొనుచుఁ ద - న్మఱుఁగ కర్థిఁ
బొల్తి చనుదెంచెఁ ద్రైలోక్య - పూజ్యుఁ నచల
భక్తిఁ బూజింపఁ జనుదెంచు — భంగివోలె.
—(కు. సం. 8—61 మొ. 63 ప.)

ఈ కథానాయక — కృతినాయక కాభేద ఘట్టములో వ్యంగ్యముగా చోడకవిరాజశిఖామణి పేర్కొన్న త్రైలోక్య మల్లయనే కృత్యవతారికలో '— మల్లికార్జును సదా కల్యాణుఁ గీర్తించెదన్' (కు. సం 1-15), 'జంగమ మల్లయ పేర సప్త సంతానము లొప్ప నిల్పుదు ముదంబున తత్ప్రభు నాజ్ఞ పెంపునన్' (కు. సం., 1-46) అని మరల కళ్యాణి చాళుక్యరాజును నిరూపించినాడు.'

ఇంతటితో కవి తృప్తిచెందలేదు. మరల కథలో పార్వతి కుపదేశగురువుగా తనగురువును ప్రవేశపెట్టినాడు. (కు. సం. 6-78 మొ. 81). ఇది నిర్వివాదవిషయము. ఇంతకు ముం దొకయెడ వన్యకాంత లెవనిగురించి పాటలుపాడిరో ఆపద్యము చూడతగినది.

చ. 'పటికపు కోల ముల్వెదురుఁ
 బ్రాలొగిఁ బోయుచు గౌరుకొమ్ముఁరో
కటఁగొని దంచుచుఁ శబర
 కామిని వెక్కులు రాగముల్ రసో
త్కట ముగఁ బాడెఁ జుట్టిన మృ
 గంబులు సోమ మనుష్యరూప ధూ
ర్జటి ముని ముఖ్యలోక గురు
 జంగమలింగము మల్లి కార్జునుఁ.'
 — (కు. సం., 6–45)

ఇందలి 'మల్ల - సోమ' శబ్దమూలకధ్వని నాగబంధములో ఎట్లు పెనచబడినదో పరికింపుడు.

చ. 'శరణము మహేశ భూరితర
 సార సుఖప్రద కామకాల సం
హర భవరోగధారణ సు
 రాసురవంద్య శరీర దు
స్తర కమలా విహార హిమ
 ధామ 'సమస్తగ సోమదేవ' వి
స్తరిత రమాదయారసయు
 తా యురులబ్ధ విభావనామయా.'
 — (కు. సం., 10–84)

ఇట్లు నాగబంధములో 'సమస్తగ సోమదేవ' కృతిపతి నామము దైవపక్షముగా, గురుపక్షముగా, 'తత్ప్రభు' పక్షముగా 'త్రైపురుషులు దానమైనగతి' (కు. సం., 8–71) ధ్వనింప జేయబడినది.

ఇట్టి 'సోమదేవ' వ్యంగ్యనామము చారిత్రకముగా కల్యాణీ పశ్చిమ చాళుక్యరాజగు త్రైలోక్యమల్ల సోమేశ్వర ప్రభుకృతిపతిత్వమును వ్యంజకము చేయగలిగియున్నది. అందు వల్లనే వ్యంగ్యగవి కృత్యవతారికలో 'నాకు గా కొరునకు నిట్లు సేకురునె యొక్కట — అన్నియుఁ' అని సూచించి నప్పటికిని భాషావాదుల కా వ్యంగసూచన తలకెక్క లేదు.

రామనామాత్యకవి కృత్యాదిలో 'దైవంబు, దాతయుఁ, దల్లియుఁ, – దండ్రియు, గురుఁడును నాతఁడే యరసి చూడ; కృష్ణుఁడు' (గయో-176) అని వాచ్యముగా పేర్కొనుటకును, పై వ్యంగ్య విశిష్టసూచనకును భేదము లేదనుట భాషావాద సమ్మతమైనను, క్రింది చోడకవి వ్యాఖ్యాన సమ్మతము కాదు.

'శ్రీ నగోత్తుంగమణి శ్రీసంగత మల్లికార్జున దేవతాకంబై జగంబులం బ్రత్యక్షుంబై ప్రవర్తిల్లుట జంగమ మల్లికార్జున దేవుండై (కల్యాణి నేలుట మల్లికార్జున ప్రభుండై) —— నెగడు సద్గురుండైన జంగమ మల్లికార్జున దేవునకు.'

— (కు. సం. 1-58)

ఇందులో వాచ్యముకా చోడకవి శ్రీ శ్రీశైలస్వామిని, శ్రీశైల గురువును మాత్రమే వివరించి, కుండలీకృత శ్రీశైల ప్రభు చరిత్రను వివరింపకుండుట కేదో రాజకీయ ప్రతిబంధక మేర్పడినట్లు తోచినను, 'వ్యంగార్థము వక్తృ, బోద్ధవ్య, ప్రకరణ, దేశకాలాదులనుబట్టి తెలియును.' కావున, తద్వ్యంగ సూచన చరిత్రను వాచ్యముగా సూచించినాడనియే నిరూపించ వీలున్నది.

'అలంకారము గూఢవస్తుమయ కావ్య'మ న్నప్పుడా రూపక కృతిపత్వ మొక్కటైనను, విడకొట్టి నప్పు డది ముగ్గురు ప్రత్యేక వ్యక్తులని యర్థ మగుట సహజము; చారిత్రకము. ఇప్పు డాముగ్గురు మల్లనామకు లనియు, సోమదేవనామకు లనియు, అందుచేతనే రూపకాభేదము చెప్పబడిన దనియు చెప్పుట చోడకవి యభిప్రాయము కాకపోదు. ఇది భాషావాదు లన్నట్లు కవి తలపని తలంపుకాదు.

కాదన్నను, కుమారసంభవ కథేతరమైన గర్భచిత్రబంధ కవితాకాల సమన్వయ మొక్కటే తత్ప్రబంధకవి కాలనిర్ణయము చేయజాలియున్నదనుట గ్రంథాధార భాషా గణిత సిద్ధాంతము.

ఇక్కడ మరికొన్ని యాక్షేపములుకూడ కలవు.

'త్రైలోక్య మల్ల (బిరుదము) లోని 'మల్ల' శబ్దమునకు మల్లికార్జుననామముతో సంబంధము లేదు. — — — —

మఱియు కళ్యాణి చాళుక్యరాజుల యధికారము పాకనాటియం దెన్నడును జెల్లుబడి కాలేదు; పాకనాటి ఇరువదియొక్క వేయి కధీశ్వరు డైన నన్నెచోడుడు త్రైలోక్యమల్ల సోమేశ్వరుని సామంతుడని యంగీకరించుటకు వీలుకాదు.'

—శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారు

(భారతి, సెప్టెంబరు- 1951.)

ఈవిధముగా ఆక్షేపించినప్పటికిని, మరియొకచర్చలో ఆచారిత్రకు లేమి వ్రాసిరో క్రింది సంగ్రహచరిత్ర తెల్పుచున్నది.

'రాజరాజనరేంద్రుని యాధిపత్యమును అతని ద్వైమాతురుడు విజయాదిత్యు డంగీకరింపలేదు. రాజరాజనరేంద్రుడు అరవ చోళరాజు దౌహిత్రుడు. అతడు పుట్టినది చోళదేశమునందు. పెరిగినది చోళదేశమునందు; రాజ్యాధిపత్యము వహించినది మాతులుడగు రాజేంద్రచోళ చక్రవర్తి సహాయమువలన. కావున విజయాదిత్యుడు చోళచక్రవర్తికి సమానస్కంధుడైన కళ్యాణి చాళుక్యచక్రవర్తికి సామంతుడై యంకకాడై యతని సహాయమువలన వేంగీరాజ్యము నాక్రమించుకొన బ్రయత్నము సేయగడగెను. క్రీ. శ. ౧౦౪౪ నన్ ఆ మరుసటి సంవత్సరమునన్ కల్యాణి చాళుక్యచక్రవర్తి త్రైలోక్య మల్లాహవమల్ల బిరుదాంకితు డగు మొదటి సోమేశ్వరుడు వేంగీరాజ్యమును జయించెను. అదిమొదలు క్రీ. శ. ౧౦౬౨ పర్యంతము వేంగిమీద నతని యధికారము జెల్లినది. రాజరాజ నరేంద్రుడు కల్యాణి చాళుక్యుల కరిగాపాయెను.'

—శ్రీ నేలటూరు వేంకటరమణయ్యగారు
(భారతి, జనవరి, 1951.)

ఈ స్వవచన వ్యాఘాతమును శ్రీ వేంకటరమణయ్యగారు గుర్తించ లేదు కాబోలు.

వేంగీ పూర్వచాళుక్య చక్రవర్తి రాజనాజనరేంద్రుడు యుద్ధమం దోడి కళ్యాణీ పశ్చిమచాళుక్యచక్రవర్తికి సామంతుడైనప్పు డాతని పాకనాటి సామంతచోడరాజులు ఉపసామంతులగుటలో చరిత్రవిరోధ మెంతమాత్రము లేదు.

ఇట్లయి నప్పుడు క్రీ. శ. 1044–62 ప్రాంతమందలి 'సమస్తగ సోమదేవ – త్రైలోక్యపూజ్య' మల్లుడు తెనుగు

కుమారసంభవ కృతిపతి యనుటలో నన్నిచోడ సామంతకవి పొరపడలేదని చారిత్రకముగా అంగీకరించుట వ్యంగ్యగణిత సిద్ధాంత సూచన.

ఇంకొకటి —

'వీనింబట్టి శాసనాధారములచే నన్నెచోడుని గుర్తించుట ఎట్లు కుదరదో అట్లే కృతిపతియైన మల్లికార్జునమునిని కూడ గుర్తించుట కష్టమే.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (12 పుట)

గ్రంథాంతరంగిక భాషాచరిత్రలో కూడ భిన్నాభిప్రాయము లున్నప్పుడా గ్రంథాంతరంగిక వ్యంగ్య గణిత సమచరిత్రను, తత్సమకాల శిలా శాసనచరిత్రను అనుమాన ప్రమాణముగా కూడ విశ్వసింప వీలులేదను కల్పిత భాషా కాల చరిత్రను నమ్మ వీలులేదు.

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు భాషావాద వ్యామోహములో పడక, చారిత్రకులుగా ఉన్నప్పుడు క్రింది ప్రాచీన భాషావాదులే యనుట స్వవచన సమ్మతము.

'— — — నన్నయకు ముందుండె నాయన్న నన్నెచోడునే స్మరింపని నన్నయ యుంబన్నను (ప్రాచీన శైవ కవిని) స్మరించునా ? — — — .'

—ఆంధ్రపత్రిక, సా. అనుబంధము
(27-7-1958 తేది ఆదివారము)

భాషావాద వికల్పములు కొన్ని గ్రంథాంతరంగిక గణిత నిదర్శన వ్యంగ్యకవి చరిత్రను సమర్థించు చున్నవి.

'కవితావిమర్శకు కాలనిర్ణయము సహకారియై విమర్శకుని శ్రమను తగ్గించుచు కార్యమును సుకరము చేయును గాన నీతని కాలమును ఇంకను దృఢముగా నిర్ణయించుట కవకాశము కలదాయని యాలోచించిన నీతనిలో నొక విశేషము కనంబడుచున్నది. అది చిత్రబంధకవిత్వము. ఈ బంధములంగూర్చి చర్చచేసి నన్నెచోడుడు నన్నయకు సమకాలికుఁడగునని శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు ఒక గ్రంథమును (నన్నిచోడకవి చరిత్రను) ప్రకటించియున్నారు. కాని అంకిత సంప్రదాయమును షష్ఠ్యంత సప్తసంతానాదికములచరిత్రమును కృత్యాద్యవతారికల రచన లభివృద్ధియైన తీరును పరికించినట్లే చిత్రబంధకవిత్వము లాంధ్రవాఙ్మయమున నెప్పుడు ప్రారంభమై వర్ధిల్లినవో తెలిసికొనిన ఈతఁడు తప్పక తిక్కనకు అనంతరము వాఁడే; నూతనము.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (69 పుట)

ఈ వాదము నిజముగా భాషావాదమైనచో గర్భకవి చోడుని ఖడ్గబంధ చిత్రకవితా కాలమును—గ్రంథాంతరంగిక గణిత సిద్ధాంతమును—విశ్వసింపక, తెనుగు చిత్రకవితా కాలాన్వేషణము చేయుట నిష్ప్రయోజనము.

భాషావాదులు క్రీ. శ. 11 శతాబ్ద మధ్యకాలమందలి శాసనములను, కావ్యములను పరిశీలించి అందలి 'ఉండు' ధాతుపరిణామచరిత్రను కాలక్రమముగా గుర్తించియున్నచో ఈ కల్పిత భాషావాదము చేసియుండరు.

నన్నిచోడుడు, నన్నియబట్టు తమ కావ్యములలో నిత్యముగా 'ఉన్నవాఁడు—ఉన్నవారు' అను వర్తమాన ప్రాచీన క్రియా రూపములను మాత్రమే వాడియుండగా, పాల్కురికి సోమన-తిక్కనాది కవులు తమ కావ్యములలో వైకల్పికముగా 'ఉన్నవాఁడు — ఉన్నాఁడు : ఉన్నవారు — ఉన్నారు' అను ప్రాచీన - నవీన క్రియారూపములు వాడియున్నారు కద! కావున, భాషావాదములోఁగూడ ప్రాచీనార్వాచీన పక్షము లున్నవని మరచిపోరాదు.

'ఇదికాక యీతనికి బశ్చిమ చాళుక్యరాజగు విక్రమాదిత్యునికిని నడుచు యుద్ధములు జరుగుచుండెను.'

—శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు
(కవిరాజ శిఖామణి, పు. 131)

అథర్వాణాచార్యుని ఛందమునందలి 'మడియడె యగునని యిడి తొల్లి టెంకణాదిత్యుడనిక' అను చాటుపద్యచరిత్ర కీయూహ కల్పనచేయబడినది కాబోలు.

క్రింది కుంతల రాజకుటుంబ కలహబీజము చారిత్రకమైనదగుచో పై యుద్ధకాలము మార్పుకావలసియుండును.

'కళ్యాణకటకమున ఆనాడు తలవనితలంపుగా కొన్ని వింతలు పుట్టెను. ఆహవమల్లునికి (సోమేశ్వరునికి) రెండవకుమారుడు విక్రమాదిత్యునిపై నే కారణముననో ఆగ్రహము జనించెను. అంతట కోపావిష్టుడై కుమారుని మదపుటేనుగు కాలి క్రింద బడద్రోసి తొక్కించుడని యానతిచ్చెను.

విక్రమ సాహసుడైన విక్రమాదిత్యుడు ఉపాయమున ఆపదనుండి తప్పించుకొని సైన్యసమేతుడై వచ్చి కృష్ణా తుంగ భద్రల నడిమిసీమలో నిర్దయాత్మ వీరవిహారము సలుపుచున్న చోళభూపతిని, తన తండ్రికి పరమ శత్రువైన వానిని గలిసి కొనెను. అపుడేమి జరిగెనో వివరములు తెలియవు. కాని వీరరాజేంద్రుడు కుమార విక్రమాదిత్యునితో సంధిజేసికొనెను. అతనికి కుంతల యువరాజ కంఠపట్టికను గట్టి, తన కూతునిచ్చి పెండ్లిచేసి యల్లునిగావించుకొనెను. ఆ వృత్తాంతములు శ. ౯౮౭ సంవత్సరమున — ఫిబ్రవరి-మార్చి, 1066 ప్రాంతమున — జరిగినట్లు కనబడును. ఆ విధముగా రాజకుటుంబమున వైమనస్యములు, కలహములు గలుగుచుండిన(వి).'

—శ్రీ భావరాజు వేంకటకృష్ణరావుగారు
(రాజరాజనరేంద్రుడు, పు. 178)

ఈ కంచిచోడులతో పాకనాటి చోడకవి చేరియున్నప్పటికేని, ఆ కూడలి సంగమ భూమిలో యుద్ధము జరిగినట్లు లేక పోగా సంధి జరిగి, పెండ్లియైనట్లు తెలియుచున్నది.

కథా ఘట్టమందలి 'సమస్తగ సోమదేవ' నాగబంధ నామము చారిత్రకముగా కళ్యాణి పశ్చిమ చాళుక్య రాజగు ఆహవమల్ల, త్రైలోక్యమల్ల 'సోమేశ్వర' ప్రభు నామమును కృతిపతుల పేర్లలో నొకటిగా కవిరాజశిఖామణి చోడుడు పేర్కొన్నాడనుట కంటె మార్గాంతరము కనుపడ లేదు. కావున, క్రీ. శ. 1044-68 మధ్యకాలములో శ్రీ కోదండ రామయ్యగారు రూహించినట్లు 'ఆకాలమున నన్నిచోడునికి,

దమిళ కన్నడ దేశీయులతో నలెనే, వారి భాషలతోడను, వారి భాషా సాంప్రదాయములతోడను గూడ విశేషపరిచయము గలిగియుండు ననుట కెట్టి సందేహమును లేదు.'

—కవిరాజ శిఖామణి, (131).

ఇట్లగుచో క్రీ. శ. 1076 ప్రాంతమందలి ఆరవ చాళుక్య విక్రమాదిత్యుని కాలమునకును, రాజరాజనరేంద్రుని కుమారుడగు చాళుక్య కులోత్తుంగ చోళరాజు కాలమునకు ముందే తమిళ-కన్నడ భాషాపరిచయము తెంకణాదిత్యకవికి కలదనుట గ్రంథాంతరంగిక వ్యంగ్యచరిత్ర.

'నన్నెచోడుని కాలమును గుఱించి పలువివాదములున్నను నాతఁడు నన్నయ-తిక్కనలకు నడుమనున్నవాఁడను వాదము బహుజన సమ్మతమగుటచేతను, గొన్ని విషయములాతని నన్నయకు సమీపకాలమువానిగా సూచించుటచేతను నన్నెచోడుఁడు తిక్కనకుఁ బూర్వుఁడనుటయే యుచితముగాఁ గనుపట్టుచున్నది. అట్లగుచోఁ గుమారసంభవములోని పద్యంత్యములనే తిక్కనామాత్యుఁడు తన గ్రంథములం దనుసరించెనని తేలుచున్నది.'

—అమరేశం నన్నెచోడుని కవిత్వము (26 పుట)

'ఉండు' ధాతుపరిణామ కాల మొక్కటే నన్ని కవిత్రయము సమకాలికులని సిద్ధాంతము చేయుచున్నది.

# షష్ఠ్యంతములు

'షష్ఠ్యంత ప్రారంభ మెచ్చట నుండి యను ప్రశ్నకు తిక్కనయే యను (శ్రీపాద) లక్ష్మీపతి శాస్త్రి గారి యభిప్రాయము కూడ సమంజసము కాదు, పూర్వము కొంత కాలము మన పండితు లెల్లరును అట్లే భావించు చుండిరి. నన్నెచోడుని గ్రంథము కనబడ గానే అది చాల ప్రాచీన మని భావించి తమ పూర్వాభి ప్రాయములను మార్చుకొనిరి. అతఁడు ప్రాచీనుఁడు కాబట్టి తర్వాతి వారు జేసిన షష్ఠ్యంతాది రచనలను అతఁడూహించి ముందే చేసినాఁడని చెప్పసాగిరి. శాస్త్రిగారు వరల మొదటికి పోయిరి. మంచిదే కాని ఈ యభిప్రాయము నిలువదు. ఏల యన షష్ఠ్యంత రచన మొదట చేసిన కవి కేతన గాని తిక్కన కాడు. అందుచేతనే కేతన యొక్క షష్ఠ్యంత రచన (కృత్యాదిలో లేక ఆశ్వాసాంత మందు కూర్చుట) అంత భిన్న మార్గమున పడినది.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (27 పుట)

ఇట్లు భాషా తత్వవేత్త లిద్దరు షష్ఠ్యంత ప్రారంభ చరిత్రను గూర్చి భిన్నాభిప్రాయము లైనప్పటికిని, నన్నెచోడుని షష్ఠ్యంత కాల రచనాదులను బట్టి ఆ ప్రబంధ మర్వాచీన భాషా చరిత్ర కుదాహరణ మనుటలో ఏకాభిప్రాయు లైనారు.

ఇటీవల వెలువడిన శ్రీ తిమ్మావఝ్ఝల కోదండ రామయ్య గారి విమర్శ : కవి రాజ శిఖామణియు, శ్రీఅమరేశం రాజేశ్వర

శర్మ గారి విమర్శ : నన్నెచోడుని కవిత్వమును తత్కవితా ప్రాచీనతను గుర్తించిచూపుటయే కాక, శ్రీపాద కుమారసంభవ విమర్శయందలి తత్కవితార్వాచీనవాదమును యథోచితముగా ఖండించి, విమర్శించినవి.

భాషావాదమునకు ప్రతికూలములగుటచేత భాషావాదులందరు శిలాశాసనములందలి క్రీ. శ. 11 శతాబ్ది-చోడకవి వంశ పురుషాంతర కాలమును అనుమానప్రమాణముగా కూడ అంగీకరించలేదు. ఏదో ఒక మిషతో శాసనములు భాషా వాదములో చెల్లుబడికాలేదు.

కృత్యాదియందలి 'మల్లయ—తత్ప్రభు' కృతిపతిత్వకాల వ్యంగ్యచరిత్ర తుమ్మెద తొలిచిన శ్రీకారమువంటిదైనది. కృత్యాది షష్ఠ్యంత కందముల పరిణామ చరిత్రయే చోడకవి కాలము నెరిగించునట. సరే, ఇందెట్టి షష్ఠ్యంత రచన కలదో పరిశీలించుట దోషముకాదు.

క్రీ. శ. 10 శతాబ్దినాటి కొరివి శిలా శాసనములో క్రింది కృత్యాది షష్ఠ్యంత గద్య కనబడుచున్నది.

'శ్రీ విక్రమాదిత్య నృపాగ్ర
తనయుఁ డయ్య
చాళుక్య భీమునకు
గౌచకష్ట పుకాసకు
వెంగీశ్వరునకు.

* * *

'శ్రీ నిరవద్యోద్ధానేక సమర సంఘట్టణ భుజాసి భాసురద్రేతను యున్న రాజ్య శ్రీ కెల్ల న్దాన యీఁ శుంద్రై చేకొని

నిల్పి భీమ సలుకి యుం దేసక వస్తువాహనోత్సవంబులు బడయు చు(ండె).'

—తెలంగానా శాసనములు (163, 164 పు.)

ఇది వచన కావ్యాదిలో బుద్ధిపూర్వకముగా వర్తించిన ప్రాచీన షష్ఠ్యంత మనుట కాక్షేపములేదు. దీనిలో వూంగా న్వాయ చాళుక్య చరిత్ర సంబంధము లేదన వీలులేదు.

తెనుగు భారత సంహితలో కృత్యాది షష్ఠ్యంత కందములు లేకపోయినను, త దాశ్వాసాంతములో షష్ఠ్యంత కంద పద్య బీజము కలదు.

క. 'అయుతుల పుణ్యునకు సు
సూయునకుఁ బరీక్ష ప్రగసుతునకు వైశం
పాయనుఁ డనంతర పుణ్యక
లాయత్తముగాఁగఁ జెప్పెనని కథాప్రతిన్.

క. 'చిరశ్రీ వనితాగ్రత
భూరి స్థిరబాహుదండ బుధనుత సుగుణా.'

—నన్నయభట్టు (ఆది. 3-224)

తన కాలమునాటికి షష్ఠ్యంత కందపద్య లక్షణము తెనుగుభాషలో కలదని నన్నయభట్టు ప్రయోగాంతర లక్ష్యము చూపినాడు. అది కృత్యాదిలో నున్నను, ఆశ్వాసాంతమున నున్నను షష్ఠ్యంతచిహ్నము కాకపోదు.

సమకాలికు లైనటువంటి నన్నికవిత్రయములోని నన్నిచోడ కవిరాజ శిఖామణి తెనుగు కుమారసంభవ కృత్యాదిలో

'సద్గురుండైన జంగమ మల్లికార్జున దేవునకు' అంకితముగా షష్ఠ్యంత కందాష్టకము చెప్పి, 'నా చెప్పంబూనిన కథా సూత్రం బెట్టిదే' అని తత్ప్రవచనారంభము కావించెను. ఇది వివాహాంశముకాదు, కావున ప్రయోగము లీయ నక్కరలేదు.

క్రీ. శ. 1158—95 ప్రాంతమందలి కాకతీయ 'ప్రతాప రుద్రుని పట్టణంబు'ను తన లెక్కలలో పేర్కొన్న పావులూరి మల్లన ఇష్టదేవతా నమస్కారము తప్ప, కృత్యాది కుకవి నిందాదులను విలక్షణముగా పేర్కొనలేదు.

శ్లో. 'తమ్ శివకరం వందే
శివం శ్రేయసే.

క. 'ప్రణమిల్లి శివుని కి క్రియ -
మణిమాది గుణాస్పదునకు - మహిమ సంఖ్యా
మణి దీప్త సార సంగ్రహ
గణిత సముచ్చయంబుఁ బఱయుఁ - గడఁగఁ బ్రతిన.'

—సార సంగ్రహ గణితము (1-3)

పావులూరి మల్లన - ప్రతాప రుద్రుల కాలము కంటె ముందు నన్ని-చోడ - ప్రోల రాజులు కల రనుట కాకతీయ వంశ క్రమము.

కాకతీయ గణపతి కాలము నాటి తిక్కన - కేతన కవుల కంటె కాకతీయ ప్రతాప రుద్రుని కాలము నాటి పూర్వ కవి పావులూరి మల్లన కృత్యాది 'తమ్ - వందే శివం శ్రేయసే' అను చతుర్థీ విభక్తిస్తుతి క్రింద షష్ఠ్యంత కందపద్య స్తుతి కనబడు చున్నది.

సంస్కృత మందలి చతుర్థీ విభక్తికి బదులుగా తెనుగు లో షష్ఠీవిభక్తి వాడుట ప్రసిద్ధము.

'ఈ విధముగా అణిమాది గుణాస్పదునకు శివునకు ప్రణమిల్లి(తి)' అనుట కృత్యాది షష్ఠ్యంత కందపద్య చిహ్నము.

ఇందలి 'క్రియ' అను నామవాచకమునకు 'కృతి-క్రియ' అను అర్థశ్లేష చెప్ప వీలున్నది. కాగా, 'ఈ కృతిని అణిమాది గుణాస్పదునకు, శివునకు (అంకిత మిచ్చి) సమస్కరించి (తి)' అనుట శబ్దార్థ శక్తి మూలకధ్వని కాబోలన వీలున్నది. ఇట్టిది క్రీ. శ. 12 శతాబ్ద షష్ఠ్యంత కంద పద్యమైనను, తత్పూర్వమే షష్ఠ్యంతాంకిత మహావృక్షము అష్ట కందములతో — అష్ట దిక్కుల నాక్రమించి యున్నదనుట ప్రబంధ లక్ష్యము; క్రీ. శ. 10 శతాబ్ద షష్ఠ్యంత వచన శాసన సమ్మతము.

ఇక తిక్కన నిర్వచనోత్తర రామాయణములో కృత్యాది షష్ఠ్యంత కందములు లేక పోయినను, తదా శ్వాసాంతములలో వృత్త కంద షష్ఠ్యంతములు వ్రాసినట్లు క్రింది యుదాహరణములు తెల్పుచున్నవి. కుమార సంభవ విమర్శాది గ్రంథములలో ఈ షష్ఠ్యం తోదాహరణములు ప్రస్తావించ బడలేదు.

చ. 'పరిజన పద్మ మిత్రునకుఁ
బాలక మిత్రున కన్య సైన్య వి
స్ఫురణలతా లవిత్రునకు
సుందర గాత్రున కంది రామనో

హర సుభగాత్ర పుత్రునకు
సంబుజ నేత్రునకుం బ్రమోదని
ర్భర ధరణీ కళత్రునకు
రాజిత గోత్రునకి జ్జగంబునన్.

క. 'లావణ్య విసర సవ జా
లావృత చతురాంగ నాగ - యశచివరునకున్
సేవా గత బహువిధ వసు
ధా పల్లిఘ సంకట కృ - త వ్యాయునకున్.

మాలిని —

'శతముఖ గురు లజ్జా
సంప దాపాద నోద్య
స్మృతికి నమిత శత్రు
క్ష్మాపసేవా తమోగ్రో
పతికి నిహత శేష
ప్రత్యర్థి కార్త్యకార్త్య
స్తుతికి విజయమాన
ప్రోహి బాహాసి కుర్విన్.'

—నిర్వచనోత్తర రామాయణము (5-142 మొ. 144)

ఇంతేకాదు; ఆశ్వాసాదిలో కూడ షష్ఠ్యంత కందమును తిక్కన చేర్చి, (5-6) అంతాదులయొక్క షష్ఠీవిభక్తి సంబంధమును దృఢపరచియున్నాడు.

క. 'శ్రీయుతునకుఁ గాంతి ప్రా
లేయరుచికి ధర్మమతికి - లీలాసుమన
స్సాయకునకుఁ బుణ్యాధి
ష్ఠాయకునకు మనుమసిద్ధి - జనపాలునకున్.'

—నిర్వచనోత్తర రామాయణము (6-1)

ఈ తిక్కన నూతన సృష్టినే తన దశకుమార చరిత్ర ప్రథమాశ్వాసాంతములో కేతన అనుకరించినాడు. అంతేకాదు; కవిబ్రహ్మ వలెనే అభినవదండికూడ మరల 5–6 ఆశ్వాసాంతాదుల సంధిలో షష్ఠ్యంతములు వ్రాసి అనుకరించి యున్నాడు. భాషా వాదు లన్నట్లు నూతనసృష్టి చేయలేదు; పై పెచ్చు 4–5 ఆశ్వాసాంతాదుల సంధిలో పునరుక్తిగా షష్ఠ్యంతానుకరణములు కూర్చినాడు.

కృత్యాదిలో షష్ఠ్యంత కందపద్య రచన విధిగా చేయవలె ననెడి నిత్యవిధి తిక్కనకాలమునాటి కుండియున్నచో భారతములో వలెనే క్రింది షష్ఠ్యంత కందములు నిర్వచనోత్తర రామాయణములో కూడ వ్రాయబడియుండెడివి.

క. 'రాజన్యా విసర సవనా
రావృత చతురాంగనా స - యాశచి పరునకుజా
సేవాగత బహువిధ వసు
ధా వల్లభ సంకట కృత - వ్యాయసకుజా.

క. 'అమ్మనుమనృపతి కథ్యాచ
యుమ్ముగ నేఁ జెప్పఁబూని - సట్టి కథకు నా
ద్యమ్మయి — — — —.'

ఇప్పుడిది తిక్కన షష్ఠ్యంతాంకిత కందపద్యోదాహరణమనుట కెట్టి సందేహము లేదు.

ఇందలి కందపద్య మెక్కడిదని ప్రశ్న రావచ్చును. ఇది నిర్వచనోత్తర రామాయణ పంచమాశ్వాసాంతములో రెండువృత్తముల మధ్యనున్న అడ్డుగడియ కందము. కాని, మరెచ్చటనుండియో ఎరువుతెచ్చిన అంకిత కందము కాదు.

అన్ని యాశ్వాసాంతములలో ఉన్నట్లే అంకిత కందము పంచమాశ్వాసాంతములో నుండుటయే శోభ. లేనిచో, పంచమాశ్వాసాంతములో అంకిత పద్యములు మూడుండవు; రెండు వృత్తములు మాత్రమే అంకిత షష్ఠ్యంతములుగా మిగులును.

పై తిక్కన షష్ఠ్యంతోదాహరణములను బట్టి కావ్యాదిలో కాని, కావ్యాంతములో కాని, ఆశ్వాసాదిలో కాని, ఆశ్వాసాంతములో కాని వృత్త-కందాదులు అంకిత షష్ఠ్యంతములుగా ఉండిన చాలునని స్పష్టమగుచున్నది.

'కేనము లేకనుర క్తయైన భాషాంగన దక్కనేలిన మహాత్మ' శాలి చోడ కవిరాజ శిఖామణి 'రుచిర కావ్య రత్న నిధి'లో నూతనముగా ప్రవేశపెట్టిన అంకిత షష్ఠ్యంత కందములను తన ప్రథమ కావ్యములో కవిబ్రహ్మ తిక్కన అనుకరించుట కిష్టములేక, స్వేచ్ఛగా (ని. ఉ. రా. 1-42, 44) సీసగీతములను అంకిత దూరాన్వయ షష్ఠ్యంతములుగా మార్చి కూర్చినను, తన ద్వితీయ భారత ప్రబంధములో తన నూతన స్వేచ్ఛకు స్వస్తిచెప్పి, పురాతన కవి సమయము పాటించి, అయిదంకిత షష్ఠ్యంత కందములు వ్రాసెననుట నిర్వివాదము.

'బుధారాధన విరాజి' తిక్కయజ్వ ప్రణీతంబైన ఉత్తర రామాయణము వంటి ఉత్తర హరివంశమును రచించిన 'సకల భాషా భూషణ' నాచన సోమనాథ కవిచక్రవర్తి భాస్కరరామాయణ కవులవలెనే కృత్యాద్యవతారిక విధుల నేమాత్రము పాటించలేదు.

క. 'శ్రీ — హరిహర నాథా.
వ. 'దేవా వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె.'

—హరివంశము (1-1, 2)

ఆశ్వాసాద్యంతముల అన్నిట నన్నయభట్టువలెనే, భాస్కరాదులవలెనే సంబోధన పద్యములను వాడినాడు; షష్ఠ్యంతాంకిత పద్య ప్రసక్తియే లేదు.

భాషావాదు లన్నట్లు కృత్యాది కుకవి నిందాదులు బొత్తిగా లేని ఉత్తర హరివంశము తిక్కన సోమయాజి ఉత్తర రామాయణముకంటె ముందు కావ్య మనవలసియుండును. కాని, ఈ భాషావాదకల్పిత సిద్ధాంతము నాచన సోముని కావ్యాంత గద్య చరిత్రకు పరమ శత్రువు.

'ఇది శ్రీమ దుభయకవి మిత్ర కొమ్మనామాత్య పుత్ర బుధారాధన విరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన శ్రీ మహాభారత కథానంతరంబున - ఉత్తర హరివంశంబు.' కావున, కృత్యాది కుకవి నిందాది కల్పిత కాలములతో - భాషావాద మిషతో ప్రాచీన కవికాలమును అర్వాచీన కవి కాలముగా మార్చి నిర్ణయించుట కాలదోషము.

అభినవదండి కేతన మొదటి దశకుమారచరిత్రలో అయిదు షష్ఠ్యంత కందపద్యములు కృత్యాదిని గాక ప్రథమాశ్వాసాంతమున అభినవ దండముగా వ్రాసినను, భాషా వాదములో ఇది నూతన సృష్టిగా అంగీకరించబడినను, తన రెండవ లక్షణ గ్రంథము — ఆంధ్రభాషాభూషణములో

గ్రంథాదిలో కాని, గ్రంథాంతమున కాని షష్ఠ్యంత కందపద్య ములను, లేక, వృత్త షష్ఠ్యంతములను వ్రాయకపోవుట కేది హేతువో తిక్కన తన మొదటి రామాయణములో షష్ఠ్యంత కందవృత్తములు ప్రథమాశ్వాస మధ్యభాగములో వ్రాయ పోవుటకును, తన రెండవ భారత ప్రథమాశ్వాస మధ్యభాగ ములో షష్ఠ్యంతకందములు వ్రాయుటకును అదియే కారణము.

క్రీ. శ. 1435 ప్రాంతమందలి అనంతామాత్యకవి తన మొదటి భోజ చరిత్రలో తచ్ఛ్రికతో తదవతారిక మధ్య భాగములో అయిదు షష్ఠ్యంత కంద పద్యములు వ్రాసి నప్పటికిని, తన రెండవ ఛందోనుతి - కృత్యాద్యవతారికలో షష్ఠ్యంత కందములను వ్రాయకపోవుటయేకాక, తదంతములో 'జలజోదరాంకిత మహాకృతి సమ్మతి నొందెడిన్' అని వ్రాసి ముగించుట కేది హేతువో అదియే తిక్కన – కేతనలు వ్రాయకపోవుటకు హేతువు. వైకల్పిక షష్ఠ్యంత విధులను నిత్యవిధు లనుకొనుట భాషావాదభ్రమ.

'ఆంధ్రులు పెంపొందించిన కృతిసమర్పణ సంప్రదా యము కన్నడ కావ్యములలో లేదు సరిగదా ప్రాకృత తమిళ కావ్యములోను లేదు. సంస్కృతముతో లేనేలేదు. ప్రాకృత కావ్యములు దాదాపు పండ్రెండవ శతాబ్దమువఱకును రచిత ములగుచునే వచ్చినవి.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (34 పుట)

కాలవిషయ మెట్లున్నను, ఈ నూతన సాంప్రదాయ చరిత్రను బయటపెట్టిన శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారి కాంధ్రలోకము ఋణపడి యున్నదనుట నిశ్చయము. కాని, 'సత్కృతిః కీర్తిహేతుః; అంకితాంశ్చ ప్రబంధాన్' అను శ్లోక పురాణ విధి సంస్కృతములో లేకపోలేదు.

'ఇట్లు అతఁడు ప్రాచీనుఁడు కాబట్టి తర్వాతివారు (కొంత కాలము మానినను) చేసిన షష్ఠ్యంతాది రచనలను అతఁడూహించి ముందే చేసినాఁడని' మన పండితు లెల్లరు చెప్పుట దోషము కాదు; క్రీ. శ. 10 శతాబ్ది కొరవి శిలా శాసన మందలి కృత్యాది వచన షష్ఠ్యంత బీజాంకురము, లేక, నన్నయ షష్ఠ్యంత కంద బీజము కలదు కద!

క్రీ. శ. 960 — 65 ప్రాంతమునందు రచింపఁబడిన తెనుగు తొలి ఛందస్సు కవిజనాశ్రయములో కూడ క్రింది షష్ఠ్యంత బీజము కనబడు చున్నది.

క. 'గురుయతి గణముల పాదాం
బురుహంబుల కెఱఁగి సుకవి - బుధజనముల నా
దరమునఁ దలఁచి తదాజ్ఞం
బరహిత చరితుఁడు జినేంద్ర - పదభక్తి మెయిన్.'
—రేచన చందస్సు, సంజ్ఞాధి కారము (2 పద్యము)

జైన గురువులకు, యతులకు, పద్య గురువులకు, యతులకు నమస్కరించినట్లు శ్లేష షష్ఠ్యంతములు రేచన వ్రాసి యున్నాడు. దీనిలో సుకవి ఇష్ట దేవతా స్తుతులు కూడ కలదు.

ఇప్పటికి శిథిలము కాక నిలిచియున్న కుమారసంభవ కావ్యములో షష్ఠ్యంత కందములు కృత్యాదిలో కనబడు చున్నవి. ఇంతే కాదు, తెనుగు భారతములో ఆశ్వాసాంత మందు,

క. ' ఆ యతుల పుణ్యునకు జన
మేజయునకుఁ బరీక్షి - త్సుతునకు — —
పుణ్య (కథ) — — చెప్పె. — — '

అను షష్ఠ్యంత కందము లేక పోలేదు. తిక్కన కేతనాదు లీ పద్ధతిని అనుకరించి నారనుట నూతన సృష్టి కాదు.

ఇక్కడ భాషావాద సార మిట్లు మార్చి కూర్చబడినది.

'శివ కవులంగూర్చి చక్కనిపరిశోధన కవకాశమున్నది. మల్లికార్జున పండితుఁడు ప్రాచీనుఁడు. క్రీ. శ. 1150–80 ల నడిమికి, బసవేశ్వరుని సమకాలికుఁడు గాన, ఈతని కాలము కుదురుచున్నది. ఇతనిది శివతత్వ సారము, మతగ్రంథము; ఎవ రికిని అంకితము గాదు.'

—వేదం నన్నిచోడుని కవిత్వము (21 పుట)

ఇక కృతి ప్రథమాశ్వాస మధ్య భాగములో షష్ఠ్యం తము లను శీర్షికతో కాకపోయినను, తచ్ఛాయాను కరణము లనదగు క్రింది షష్ఠ్యంత కందములు ప్రాచీన శైవకవి వ్రాసినట్లు నిదర్శన భాషా చరిత్ర చెప్పక చెప్పు చున్నది.

'— — — శ్రీమ
త్పర్వత పుత్రీపతి మ
ద్గీర్వ్యాభవము శక్తి (కొలఁదిఁ) - గీర్తింతు శివా. —(17)

క. 'జయ మగు వేదంబులకును
జయ మగుఁ బంచాక్షరికిని - జయ మగు నిటలా
శ్రయ మగు భసితంబునకును
జయ మగు మాహేశ్వరులకు - సంతతము శివా.

క. జయ మగు శివమార్గమునకు
జయ మగు శివసంహతులకు - జయ మగుఁ గ్రియా
మయులగు ప్రమథ గణములకు
జయ మగు వేదాది ధర్మ - చరితులకు శివా.

క. శివమగు ధార్మిక నృపులకు
శివమగు గో బ్రాహ్మణులకు - శివమగు మతియుక్
శివనిందా విరహితులగు
భువనత్రయ జనులకెల్లఁ - బుణ్యంబు హరా.'
'జ్ఞానము పశుపాశపతి - జ్ఞానము యని — — .' — (21)
—శివతత్త్వ సారము, (18 మొ. 20 వరకు)

ఈ ఆశీర్వాదరూప షష్ఠ్యంత కందపద్యత్రయము క్రీ. శ. 1160–70 ప్రాంతమందలి పండిత మల్లికార్జున శైవకవి శివతత్త్వసార–అవతారిక మధ్యభాగమందలిదే కాని, తదంత్య భాగమందలిది కాదు.

తచ్ఛివతత్త్వసారాంతములో కూడ క్రింది షష్ఠ్యంత కంద శిథిలము రచింపబడి నట్లున్నది.

క. 'స్నానములకు దానములకు
మౌనములకు హోమములకు - మఱి వేకొనఁ డీ
శానుఁడు నమ్మిన భక్తిక
మానక * — — — — .' —(489)

వ. ' * శ్రీ శ్రీ జా యు నూ — ' అని మూలమందుఁ బపరనున్నది.'
—సంపాదకీయము

పై శివతత్త్వసార కృత్యాది మధ్య భాగమందలి షష్ఠ్యంత కందపద్యత్రయము మాహేశ్వరులకు, లేక, ధార్మిక నృపులకు ఆశీర్వచన రూపకముగా అంకితము చేయబడినట్లు వ్యంజకమగు చున్నను, భాషావాదుల కా క్రీ. శ. 12 శతాబ్ది షష్ఠ్యంత కందపద్య రచన పనికిమాలిన భాషా నిదర్శన చరిత్రగా గోచ రించుట దురదృష్టము.

క్రీ. శ. 11 శతాబ్దమందలి శైవకవి నన్నిచోడుని షష్ఠ్యంత కందపక్కిని క్రీ. శ. 12 శతాబ్ది శైవకవి పండిత మల్లికార్జునుడు గుర్తించి, ఆ ప్రాచీన షష్ఠ్యంత కంద పద్య విశిష్టత నెట్లో ఒకట్లు తన శివతత్త్వసార గ్రంథములో చేర్చు కొనియుండగా, క్రీ. శ. 13 శతాబ్ది అద్వైతకవులు తిక్కన-కేత నాదులు సందర్భోచితముగా షష్ఠ్యంత రచనానుకరణము కావించి రనుట కావ్యోదాహరణ భాషాచరిత్ర.

'శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రిగారు తలంచినది సాధువే; షష్ఠ్యంత రచన చక్కగాఁ నెలకొన్న తర్వాతి రచన కాని ఇది (చోడకవిరాజ శిఖామణి కృతి) అంతకు ముందుదికాదు. ఇంత దూరము శ్రీశాస్త్రిగారు చర్చించి తేల్చునందున వారి భావములు విమర్శకులు గ్రహించలేకపోయిరి. పై యభి ప్రాయమును ద్రఢీకరించు గట్టి నిదర్శనము సప్తసంతానముల ప్రశంస. ఇది శ్రీశాస్త్రిగారి దృక్పథము దాటి పోవుట నా యదృష్టమే.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (36 వుట)

ఈ వాదమం దెంత సత్యమున్నదో చూచితిరి కద!

మొల్ల రామాయణములో ఇష్టదేవతాది కృతి ప్రారంభ లక్షణము లన్నియు కలవు. కాని, షష్ఠ్యంత కందపద్యములు మాత్రము లేవు.

'నాచేయంబూనిన మొల్ల రామాయణమునకుఁ గథా విధానం బెట్టులనిన.' —మొ. రా. (25)

ఇక్కడ ప్రశ్న యేమిటంటే - ఈమెకు షష్ఠ్యంతపద్యములు వ్రాయుట తెలియునా ? లేదా అనుట. దీనికి జవాబు క్రిందికథలో కనబడుచున్నది.

శా. 'పారావారగభీరికిన్ ద్యుతిలస
త్పద్మారికిన్ నిత్యవి
స్తారోదార విహారికిన్ సుజనర
క్షాదక్షదక్షారికిన్
సారాచార విచారికిన్ మదరిపు
క్ష్మాపాల సంహారికిన్
వీరాసాటి నృపాలకుల్ దశరథ
క్ష్మానాథ జంభారికిన్.'

—బాలకాండ కథ (97)

ఇట్లు కాండాంతకథలో షష్ఠ్యంత వృత్తము వ్రాసినకవయిత్రి మొల్ల తదాశ్వాసాంతములో 'జలజాక్ష, — — —, జానకీనాథా.' అని కృతిపతిని ఒక్క కందపద్యములో సంబోధించుటకేమి హేతువో భాషావాదులు గుర్తించిచెప్పలేదు. ఆశ్వాసాద్యంతములు అన్నిట ఒక్కొక్క సంబోధన కందపద్యమును మాత్రమే వర్ణించినది. కావ్యాంతములో సంబోధనకందముతోపాటు సంబోధన మాలినీవృత్తముకూడ చేర్చిచెప్పినది.

ఇట్టిస్వేచ్ఛా కవిజీవులకు నిత్యషష్ఠ్యంతవిధులు విధించుట భాషావాద కల్పన; క్రమపరిణామము కాదు.

# సప్త సంతానములు

ఇక సప్తసంతానముల అదృష్ట మెట్టిదో కూడ పరిశీలింతము.

భాషావాదులకు ప్రాచీన షష్ఠ్యంత కాల మెట్లున్నను, ఈ సప్త సంతానముల ప్రశంస బహు పురాతనమైన దనుట పురాణ ప్రసిద్ధము.

‘ఉపదిశతి హితార్థాన్ ప్రేయసీ సమ్మితాయా
శమయతి దురితౌఘం మంగళం చాతనోతి
అభిముఖయతి దేవాన్ సత్కృతిః కీర్తిహేతు
ర్నయతి ధనమశేషా సంకితాంశ్చ ప్రబంధాన్.

మహానదీ ప్రవిష్టాని
రథ్యాముఖా నివ పావనాః
కావ్యే ష్వంకిత నామానః
సేవ్యంతే మానవై ర్నరాః.

తటాకం ధన నిక్షేపం ద్విజస్థాపన మేవచ
వనం శివాలయం కావ్యం నందనశ్చ నదాన్నృణామ్
ముక్తి వా స్సప్త సంతానా మహా పాతకి నామపి
తారయన్తి చ దుర్గేభ్యః పితౄనుభయ వంశజాన్.’

—‘అనేక శ్రుతి స్మృతి పురాణేతి హాస’ ప్రమాణ మని
బాలసరస్వతి ప్రస్తావన.

ఇవి ఏ పురాణేతిహాసమందలివో విజ్ఞులు వివరించవలసి యున్నది.

ఇష్టాపూర్త శ్లోకమందలి ‘ద్విజస్థాపన’ కుమారసంభవ కృత్యాది పద్యములో ‘మహాగ్రహార’ స్థాపనగా మార్పు

చేయబడినది; ఇది తప్ప తక్కిన వన్నియు సమానార్థక దానము లనుట నిరాక్షేపము. 'వర' శబ్దము విమర్శకులన్నట్లు 'పుర' శబ్దము కాదు. 'మహాగ్రహార పుర'మనుటకంటె 'మహా గ్రహార; వరపుత్ర సమున్నతి' యనుట గుణౌచిత్యము.

నృపులు — దుర్గాధిపతులు సప్త సంతాన దానములు కావించినచో వా రెంత మహా పాతకులైనను తాము ముక్తిని పొందుటయేకాక, తమ మాతా పితృ వంశములు రెంటిని తరింపజేతు రనుట పురాణేతిహాస ఫలశ్రుతి. కాని, 'అందు నుత్కృష్ట సంతానంబు సత్కృతియకా నిశ్చయిం(చుట)' కృత్యాది కవసరమగు నూత్న రుచిర కావ్య రత్నపీఠి. రాజకవి నిత్య విధి.

'సంస్కృత ప్రాకృత ద్రావిడ కర్ణాటక వాఙ్మయముల లో నెచటను కానరాని నూతన భావ మొకటి ఆంధ్రులకు ఆంధ్ర వాఙ్మయ ప్రారంభకాలమునుండియు నేర్పడి క్రమము గా నభివృద్ధియైనది కలదు. అది కృతి సప్తసంతానములలో నొకటి యనుట.' —(37 పుట)

* *

'క్రీ. శ. 1146 నాటికి అగ్రహారమును మనవారు సప్త సంతతులలో చేర్పలేదు.' —(41 పుట)

* *

'మఱి శాసనములలో కృతి సప్త సంతానములలో నొకటి యని క్రీ. శ. 1130 నుండియు కనంబడుచుండఁగా

వాఙ్మయమున దాని ప్రశంస ఆతర్వాత రెండుపందల సంవత్స రముల కానచ్చుట యని ఆశ్చర్యము కలుగక మానదు. దీనికి కారణము ఏమిగా నుండును!'

—వేదం నన్నెచోడుని కవిత్వము (51 పుట)

ఈ భాషా నిదర్శన కాలవాదుల జిజ్ఞాసకు గంజాము జిల్లా దీర్ఘాసి పద్యశిలా శాసనములో క్రింది సమాధానము లభ్యమగుచున్నది.

సీ. 'శ్రీ శకునెల్లెఱు ఘనతపై శైల
సప్తాబ్ధి భవసంఖ్య నొంది....

*                    *

గీ. గగనభూమి చంద్ర - ఖర కరోదక శిఖి
మారుతాత్మ మూర్తిఁ - మహిమ మనస
యిష్ట పూర్తిఁ ఫలము - లెల్ల కాలంబును
మెచ్చు తోడందముకు - నిచ్చుచుణ్డు.'

—శాసన పద్యమంజరి, (1 భా. 5-6 పుట)

క్రీ. శ. 1075 తేది ఈ శిలా శాసనములో పేర్కొన్న 'ఇష్టాపూర్తఫలము' సప్త సంతాన దాన ఫలమే కాని, తదన్యము కాదు.

'ఇష్టమనఁగా అగ్నిహోత్రాది కర్మము; పూర్తమనఁగా వాపీకూప తటాకారామ దేవాలయ నిర్మాణమును అన్న దానమును — ఇష్టాపూర్తము.'

—సూర్య రాయాంధ్ర నిఘంటువు.

'ఇష్టాపూర్తముల లోపలను విశేషమైన పూర్త కావ్యము సర్వపాప హరము గనుకను 'కీర్తిం సర్గఫలాం ప్రాహు రాసంసార విపశ్చితః' అనియు, 'మహాకీర్త్యా' అనియు మొదలైన శృతి స్మృతి పురాణేతి హాసముల చేతఁ గీర్తి ప్రతిపాదింపఁ బడును.'

—ఆంధ్ర శబ్దచింతామణి టీక (3 పుట)

కవిరాజ శిఖామణి కూడ పై పురాణ శ్లోకాభిప్రాయ ప్రకారము క్రింది సిద్ధాంతమును ప్రకటించెను.

'సప్త సంతానములు – అందు నుత్కృష్ట సంతానంబు కృతియగా నిశ్చయించి – లోకమునం బ్రసిద్ధిగా భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబు గాగ.'

—కు. సం. (1-46, 47, 48)

క్రీ. శ. 1075 తేదీ దీర్ఘాసి పద్యశాసనము కంటె ముందు తన కావ్యావతారికలో సప్త సంతానము లనగా ఇష్టాపూర్తములను పేర్కొన్న కుమార సంభవ కావ్యకర్త భాషాదు లూహించినట్లు అర్వాచీన కవియగునో, ప్రాచీన కవిరాజ శిఖామణి యగునో చారిత్రక భాషా తత్త్వవేత్తలు నిర్ణయించుట నిష్పక్షపాత లక్షణము.

భారత కృత్యాదిలో కూడ కృత్యారంభ దానవర్ణన సంగ్రహముగా లేకపోలేదు. సీసపద్యము తరువాతి గీతి.

ఆ. 'చారుతర మహాగ్ర - హారంబు లిచ్చుచు
దేవ భోగముల మ - హా విభూతిఁ
చనరఁజేయు చిట్లు - మనుమార్గుఁడగు విష్ణు
వర్ధనుండు వంశ - వర్ధనుండు.

వ. — — — — — — — —
విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాస గోష్ఠి సుఖోప
విష్టుండయి యిష్టకథా వినోదంబుల నుండి యొక్కనాడు.

చ. — మదీయ చిత్తము ననిశంబు
భారత కథాశ్రవణ ప్రవణంబు గావునన్.

క. — తెనుఁగున రచియింపు మధిక - ధీయుక్తి మెయిన్.'

—(ఆది. 1 ఆ. 7-16)

ఇందులో నన్నయ భట్టు పేర్కొన్న 'మను మార్గము – మహాగ్రహార, దేవ భోగములు' సప్త సంతాన ప్రాచీనతను వాచ్యముగా సూచించు చున్నవి.

భారత సభాపర్వకథ సప్తసంతానములందలి 'సల్లిండ్ల నిలుపుట'ను తెల్పుచున్నది.

వ. 'మఱియు నయ్యుధిష్ఠిరుండు,

సీ. అనుపమం బై యెనుబది - యెనిమిది వేవురు
బ్రాహ్మణ ప్రవరుల - బ్రహ్మవిదుల
వెలయంగ సల్లిండ్ల - నిలిపి ప్రత్యేకంబ
మున్నూఱు దాసుల - నొప్ప నిచ్చి
ముదముతో రక్షించు — — —.'

—(సభా. 2-120, 121)

భాషావాదుల కాలమాన ప్రకారం మీా నల్లిండ్ల నిలువుటను ప్రయోగించిన భారతకవి నన్నయభట్టు క్రీ. శ. 12 శతాబ్ది కవిగా మారవలసిన గతిపట్టినది.

'నల్లిల్లు' అను పేరు మొట్టమొదటి పర్యాయము క్రీ. శ. 1158 నాటి నుదురుపాటి శాసనములో కనబడు చున్నది.'
— (46 పుట)

'ఆంధ్ర వాఙ్మయమున సప్తసంతానములను మొదట పేర్కొన్న కావ్యకర్త మంచన.'
—వేదం నన్నెచోడుని కవిత్వము (39 పుట)

'నల్లిండ్ల' భారత ప్రయోగము నైనను చూడక దాని కాలనిర్ణయము చేయు భాషావాదము చెల్లదు.

క్రీ. శ. 11 శతాబ్ది మధ్యకాలములో నన్నయభట్టు ప్రయోగించిన 'నల్లిండ్ల నిలువుట' కృత్యాది సప్త సంతానములలో నన్నిచోడకవి పేర్కొనక పోయినంతమాత్రముననే, ఆ సమకాలికుల కాలములో 'నల్లిండ్లు' దానము లేదన కూడదు. అది 'నలి+ఇండ్లు – నల్లిండ్లు' కాబోలన్న ధనధాన్య దాసదాసీలతో నివాసయోగ్యములైన మేలిండ్ల దానమగును. సామాన్య గృహదానములకంటె సర్వసౌఖ్యములతో కూడిన గృహదానము లనుట మేలు. నలి – ఒప్పిదమైనది.

నన్నయభట్టు కథలో శిష్టాచారముగా 'నల్లిండ్ల – బ్రాహ్మణ ప్రవరుల – బ్రహ్మవిదుల' నిల్పి రక్షించినను, భారతావతారికలో 'అగ్రజన్ములకు ననుగ్రహమునఁ జారుతర మహో

గ్రహారంబులు (1-7); 'గోశతంబు నుత్తములగు వేదవిప్రులకు దానము' (1-15) చేయించినను, ఇవన్నియు నల్లిండ్లు కాజాలవు. సప్తసంతానములలో కొన్ని.

మొదటి సప్తసంతానశ్లోకములో పేర్కొన్న 'బ్రహ్మస్థాపన' భారత మందలి 'విప్రకులమునెల్ల (నల్లిండ్ల నిలిపి) బ్రోచుట' కాబో లనిపించుచున్నది. సప్త సంతానములలో చోడకవిరాజు పేర్కొన్న మహాగ్రహార(ము)ను, కృత్యాదిలో నన్నయభట్టు పేర్కొన్న మహాగ్రహారంబులును సప్తసంతానములలో చేరిన వైనను, అవి నల్లిండ్లుకావు.

తిమ్మాపుర శాసన సీసములోని క్రిందిగీతి ఉత్తరార్థ మీ నల్లిండ్ల వివరము తెలుపుచున్నది.

తే. 'భూసురోత్తమ వరులకు - భూమిదాస
మిచ్చి నల్లిండ్లు నిలిపి తా - నిష్టపట్టి.'

పై నన్నయ నల్లిండ్ల పద్యములో బ్రాహ్మణ ప్రవరులకు భూమిదాన మిచ్చినట్లులేదు. 'దాసుల (దాస - దాసీల) నిచ్చి' మేలిండ్లయందు నిలిపి రక్షించినట్లు చెప్పబడినది.

హరివంశ కృత్యాదిలో ఎఱ్ఱాప్రెగడ 'ఇష్టాపూర్త రూపంబగు క్రియాకలాపంబు' క్రింది సీసములో వివరించి యున్నాడు.

సీ. 'అగ్రహారములు వి - ఖ్యాత పోవృద్ధవి
ప్రులకిచ్చి యజ్ఞక - ర్తలుగనునిచె

నిధులు నల్లిండ్లును - నిలిపెఁదోటలు సత్ర
ములు చలిపందిళ్ళు - వెలయఁబెట్టె.'

—హరి వంశము (1-19)

ఇవన్నియు 'కృతి శుభావళులు' అని కూడ గీతములో చెప్పబడినది.

దీనిలో 'అగ్రహారములు – నల్లిండ్లు' భిన్నదానములుగా చెప్పబడినవి. కనుకనే, నన్నిచోడు డీనల్లిండ్లను ప్రయోగించక మహాగ్రహారములను మాత్రమే పేర్కొన్నాడనియు, నన్నయ భట్టీ రెండును వేరు వేరు దానములని భావించి భిన్నఘట్ట ములలో చేర్చి వర్ణించినట్లు కనబడుచున్నది.

పై చర్చను బట్టి 'నల్లిండ్లు (సంధిసైచి త్రి)–నలి+ఇండ్లు – నలిండ్లు – నల్లిండ్లు' కాబోలునే కాని 'నల్ల+ఇండ్లు' కావు. నివాసయోగ్యములైన మేలిండ్లు.

తిక్కన భారత కృత్యాదిలో సప్తసంతానములను పేర్కొన లేదు కాని, సంస్కృత భారతములో 'దాన' ములన్న మూలము నాధారముగా తీసికొని, శాంతిపర్వకథలో క్రింది యిష్టాపూర్తములను పెంచివ్రాసినట్లు తోచుచున్నది.

క. 'చలిపందిళ్ళను సత్రం
బులుఁ బెట్టించెను దటాక - ములు దేవగృహ
మ్ములుఁ గల్పించెను బంధుజ
నులకు సుగతి యగుటకై - వినుత ఘంగి నృపా.

క. 'లోకమునఁ గలుగు భూసుర
లోక మునకు నెల్ల గోవు - లుం బసిడియు నా
నా కల్పంబులు బంధుల
కై కోటి విధముల నిచ్చె నతులిత భక్తిన్.'

—శాంతి (1-383, 384)

ఇందలి 'కల్పంబులు' కల్పవృక్షములవంటి తోపులు కాబోలు. ఇవి అన్నియు సప్త సంతానములనుట కాక్షేపము లేదు. కోటి విధములలో కృతి, గుడి, నల్లిండ్లు, అగ్రహారములు లేనంత మాత్రముచేతనే అవి తత్పూర్వ శాసన దానములు కా వనుట కాలక్రమ చరిత్రకాదు.

క్రీ. శ. 1132 తేదీ ఎనమల కుదురు శిలాశాసనములో 'ఆదిం జెప్పంగ షడ్ధర్మ్మవులు' పేర్కొనుటను బట్టియు, క్రీ. శ. 1075 తేదీ దీర్ఘాసి శాసనమందు 'ఇష్టపూర్తఫలములు - సప్త సంతాన ఫలములు' పేర్కొనుటను బట్టియు, పురాణాదులందలి 'సప్తసంతాన' దానఫలములను కృత్యాదిలో పేర్కొన్న చోడకవి అర్వాచీనకవికానే కాడనక తప్పదు. నన్నయ సప్తసంతానముల పేరుచెప్పక పోయినను, అందలి 'అగ్రహారములు - నల్లిండ్లు - దేవభోగములు - గోవులు' పేర్కొన్నాడనక తప్పదు. తిక్కన పూర్తిపట్టికకూడ కలదు.

'అంకితాంశ్చ ప్రబంధాన్ - కావ్యే ష్వంకిత నామానః' అను కావ్యాంకిత ప్రశస్తి చాల పురాతనలక్షణమే కాని, నూతన భాషాచరిత్ర కాదు.

'ఇష్టాపూర్తము'ల కర్థము తెలిసియు, శ్రీ గాయశాస్త్రిగారు క్రీ. శ. 11 శతాబ్ద శాసనపద్యమందలి 'ఇష్టపూర్త ఫలము-సప్తసంతాన ఫలము' గుర్తింపక పోవుట భాషావాద భ్రమ కాబోలు.

---

# అష్టాదశవర్ణనలు

క్రీ. శ. 1054 తేదీ ఖడ్గబంధ చిత్ర కవితా కాలముతో పాటు 'వర్ణనాష్టాదశముః' (కు. సం. 1—44) — — — — 'విస్తరించెదఁ బ్రబంధము' (కు. సం. 1-48) అని తత్కావ్య కర్త చోడకవి రాజు పేర్కొన్నప్పుడు అష్టాదశవర్ణనల కాలమెప్పటిదని భాషావాదులు ప్రశ్నించుట న్యాయ సమ్మతము కాదు.

క్రీ. శ. 1053 తేదీ నందమపూడి తామ్ర శాసనములో 'పైశాచి కాంధ్రభాషాసు కవి శేఖర — — — అష్టాదశావధారణ చక్రవర్తి — — నన్నినారాయణ' భట్టు 'అవధానం' ప్రతిభ వర్ణింపబడియున్నది. 'ధారణఁ దప్పకుండ నవధాన మొనర్చిన' — అవధారణ పర్యాయనామము సిద్ధించును. కాగా, ఇది అష్టాదశ ప్రబంధవర్ణనలతో కల్పించు అష్టాదశావధానము కాబో లనిపించుచున్నది.

ఈ యూహకు జక్కన విక్రమార్క చరిత్రావతారిక సూచన తోడ్పడుచున్నది.

'ఆంధ్ర కవిత్వంబు - సంధుఁ బ్రబంధంబు
మేలు నాఁ దజ్ఞులు - మెచ్చఁ జెప్ప
.... .... .... ....
.... .... .... ....
నెవ్వఁడే యవధాన - మెఱఁగు సయ్యవధాన
మున వాని కించుక - ముల్లసూప
.... .... .... ....

కావ్యపర్గము( జెప్ప(గా( బ్రబంధంబులు
గ్రొత్తలు పుట్టించుకొని లిఖింప(గా
.... .... .... ....
మహిమగాంచిన పెద్దయామాత్యసుకవి
.... .... .... ....'

—వేదం నన్నెచోడుని కవిత్వము (73 పుట)

ఇట్లిది క్రీ. శ. 13 శతాబ్ది ప్రబంధావధాన చరిత్రగా కనబడుచున్నను, తత్పూర్వము క్రీ. శ. 11 శతాబ్దిలో ఆంధ్ర 'అష్టాదశావధారణ—అష్టాదశావధాన చక్రవర్తి' తనకిష్టుడు, సహాధ్యాయుడు కలడని నన్నయభట్టు చెప్పినను భాషా వాదులు పెడచెవిని పెట్టుట పక్షపాతమే.

ఉత్తర హిందూస్థానములో 'అష్టావధాన, షోడశావధాన, పంచవింశత్యవధానము' లున్నను, ఆంధ్రదేశమందున్న అష్టాదశావధారణ పూర్వ ఫక్కి లేదు. తెనుగునాటిలో ఇప్పుడు అష్టావధాన – శతావధానములు మాత్రమే విరివిగా కలవు. అష్టాదశావధానములకు బదులు తద్వర్ణనలు చెల రేగినవి.

ఇక్కడ కుమారసంభవమందలి 'బృహత్కథ' కాల చరిత్రను పరిశీలించుట సహాయకారి.

'...... ఉమామహేశ్వరులు కుమారు ననేక వేద శాస్త్రాగమ పురాణేతిహాసకథా బృహత్కథా ద్యఖిల విద్యావేదికలయందుం బారంగతుం జేసి(రి)......'

—కు. సం. (12 - 215)

'ఈ బృహత్కథ క్రీ.శ. పన్నెండవ శతాబ్దివరకునుగూడ సజీవమైయున్నట్లు తెలియవచ్చును.'

—శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు
(సంస్కృత వాఙ్మయ చరిత్ర, II – 270 పుట.)

క్రీ. శ. 11 శతాబ్దిలో నన్నిచోడకవి కాలమువరకు విద్యాభ్యాసములో పైశాచీ ప్రాకృతములు కూడ నేర్పెడి వారనుట గ్రంథాంతరంగిక భాషాచరిత్ర. తర్వాత క్రీ. శ. 1060–80 ప్రాంతములో కాశ్మీర ప్రభువు అనంతవర్మ ఆస్థాన కవి క్షేమేంద్రుడు బృహత్కథామంజరి యను పేర సంస్కృత పద్య కావ్యము వ్రాయగా, తదాస్థానకవి సోమదేవభట్టు కథాసరిత్సాగర మను పేర మరియొక కావ్యము వ్రాసినట్లు తెలియుచున్నది. ఇప్పుడా పైశాచిక కథ చిక్క లేదు.

క్రీ. శ. 1053 తేదీ నందమపూడి తామ్రశాసనములో 'పైశాచికాంధ్ర భాషా' చరిత్ర సూచన కనబడుచున్నది.

'యః సంస్కృత కర్ణాట ప్రాకృత పైశాచికాంధ్ర భాషాసు కవిశేఖర ఇతిప్రథితః ...'

—ఆంధ్రకవి తరంగిణి (1-134 పుట)

ప్రాకృతములలో పైశాచీ ప్రాకృతమును చేర్చక, పైశాచికము – ఆంధ్రము అని కాని, లేక, పైశాచికాంధ్రము అని కాని చెప్పుటలో శబ్దశాసన కవియుద్దేశమేమో చారిత్రకులు తర్కించి నిర్ణయించుట శ్రేష్ఠము. పైశాచీ ప్రాకృతమే ఆంధ్ర భాషకు మూల మనుటకీ సూచన తోడ్పడుచున్నది. తత్సమకాలిక కవిరాజశిఖామణి విద్యాభ్యాసములో 'బృహ

త్కథ' కావ్యమనగా పైశాచిక బృహత్కథ పాత్యగ్రంథ ముగా పేర్కొనుట భాషాసమచరిత్ర కాకపోదు.

కవిచోడుడు తన సమకాలికుడు క్షేమేంద్రకవి రచించిన బృహత్కథామంజరిని పేర్కొనక, తన్మూల బృహత్కథను పేర్కొనుట అర్వాచీన లక్షణము కాదు. ప్రాచీన భాషా చరిత్ర.

చ. 'మునుకొని వేశ కాలబల - ముం పగు దైవబలంబు గల్గఁగా
—నన్నిచోడకవి

చ. మునుకొని వేశ కాలబల - ముం దగు దైవబలంబు గల్గఁగా
—క్షేమేంద్రకవి

చ. మొదలను వేశ కాలబల - ముఱ్ఱ మఱి దైవబలంబు గల్గి —,'
—నన్నయభట్టు

ఈ సమకాలికుల పద్యానుకరణము ఎట్టిదో అట్టిదే 'బృహత్కథ — బృహత్కథామంజరి — పైశాచికాంధ్రభాష.'

కాశ్మీర రాజాస్థాన కవి క్షేమేంద్రుఁడు తెనుగు కవి యనుటకు పై ముద్రారాక్షస సానుకరణ పద్యము ప్రమాణము. ఇది సకల నీతిసారోదాహరణము.

'ఈ క్షేమేంద్రకవి ('సువృత్త తిలకమందు) రచించిన కొన్ని విషయములు మన నన్నిచోడ మహాకవి పాటించినట్లు ఈ క్రింది యుదాహరణములను బట్టి యెఱుఁగనగును. మఱి కొన్ని యితర కవులు నన్నయాదులందును గాననగును.'

— అమరేశం నన్నెచోడుని కవిత్వము (45 పుట)

కాలక్రమమును బట్టి చూచినచో క్రీ. శ. 1019-60 ప్రాంతమందలి కావ్యకర్త నన్నియభట్టు శబ్దశాసనుడును, క్రీ.శ. 1028-58 ప్రాంతమందలి సత్కవి నన్నిచోడరాజును, క్రీ. శ. 1060-80 ప్రాంతమందలి క్షేమేంద్రకవియు, సమకాలికులై చారిత్రకముగా ఒకరి నొకరనుకరించినట్లు చెప్పుట దోషముకాదు. రచనాకాల పూర్వాపర తారతమ్యములు సూక్ష్మముగా తెలియనిదే సమకాలికుల అనుకరణ కాలములు నిర్ణయించ వీలులేదు.

క్రీ. శ. 960-65 ప్రాంతమందలి దానార్ణవ చాళుక్య రాజకవి సహాయుడుగా రేచన రచించిన కవిజనాశ్రయములో వృత్తముల పేర్లు ఆ ఛందస్సులలో సూచింపబడిన వనుట మరచి పోరాదు. సువృత్తతిలకాదులే ప్రాచీన ఛందోమార్గమును వివరించిన వనుట దోషముకాదు. 'శిష్టజన సేవిత—— —— ——, మంగళ మహాశ్రీ నామమగు.' ఇత్యాదులు. 'శిష్టతతికి ——— నిచ్చు దయ మంగ మహశ్రీ' అనుకరణ కుమారసంభవ కావ్యాంతములో ప్రత్యక్షమైన దనుట సువృత్తతిలకానుకరణము కాకపోయినను, జైన కవిఛందోనుకరణ మనక తప్పదు.

ఇంతకు క్రీ. శ. 11 శతాబ్దములో అష్టాదశావధానములు - అష్టాదశ వర్ణనలు నిర్వివాదముగా కల వనుట నన్ని కవిత్రయ సమ్మతము.

---

# బంధచిత్రములు

'అందరినిమించి, మనకింకను చిక్కులు పెట్టుటకు, నన్నిచోడుఁడు తన చక్రబంధమున కృతిపతి కృతికర్తృ నామములు వచ్చునట్లు వ్రాయలేదు. వలయమునందు మూడవ యక్షరములను చేర్చిన 'ముకలం స్సైషైక' అనియు ఆఱవ యక్షరములను చేర్చి చదివిన 'నాదమంద్రై దేవ' అనియు నగుచున్నది. అర్థమేమో తెలియుటలేదు. 'ఇది నన్నెచోడుని ప్రాచీనత కొక కారణము. నన్నెచోడుని చక్రబంధమున గృతికర్తృ గృతిపతి నామములు గుప్తముగాలేవు. ఈ విధముగానే కవిరాజ మార్గమను (కన్నడ) ప్రాచీనతమ కావ్యములలో నీ నియతి కానరాదు. ఈ మర్యాద యిటీవలఁ బుట్టెనని తోఁచుచున్నది.' అని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు (కు. సం. ద్వి. భాగపీఠిక) 1914 లో వ్రాసినారు. ఒకవిధముగా ప్రాచీనతను సూచించుట వాస్తవమే గాని ఏకాలమును?'

—వేదం నన్నెచోడుని కవిత్వము (79-80)

క్రీ. శ. 6 శతాబ్ది మధ్యకాలమున రచించిన సంస్కృత మార్గచక్రబంధములో క్రింది గూఢనామములు కాన్పించుచున్నవి. కాని, క్రీ. శ. 11 శతాబ్దములో రచించిన జాను తెనుగు దేశి చక్రబంధములో తద్గూఢ నామాదులు కన్పించుట లేదు.

| | | | |
|---|---|---|---|
| ధః | | * శి | |
| | దం | † మా | |
| వ | మి | ఘ | శు |
| | వ్య | కా | |
| ల | | పా | |

మార్గ చక్రబంధము

మాఘుడు [19-120]

| | | | |
|---|---|---|---|
| వ | | * నా | |
| | క | † ము | |
| దే | శై | క | ద |
| | సే | లం | |
| దై | | మం | |

దేశి చక్రబంధము

చోడుడు [12-200]

ఎట్లయినప్పటికిని, తన చక్రబంధములో తన పేరును, తన కావ్యము పేరును గూఢముగా పేర్కొన్న మార్గకవి మాఘుడు నిర్వివాదముగా దేశికవి నన్నిచోడకవిరాజశిఖామణికంటె పూర్వకవియగునే కాని, చక్రబంధములో తద్గూఢ నామాదులు పేర్కొనక పోయినంత మాత్రముననే తదర్వాచీనకవి యెంతమాత్రము కాడు. మాఘకవి కాలము క్రీ. శ. 550 ప్రాంతమన్నను, లేక, క్రీ. శ. 1040 ప్రాంతమన్నను క్రీ. శ. 1053–54 ప్రాంతమందలి నన్నిచోడకవి కాలము అతనికంటె పూర్వకాలము కాజాలదు; పక్షాంతరముగా సమకాలమైతే కావచ్చును.

నన్నిచోడకవి స్తుతించిన మార్గకవి స్తుతిలో మాఘకవి ప్రశంస లేకపోయినను, భారవి వస్తుకవితా ప్రశంస లేకపోలేదు. కిరాతార్జునీయ కావ్యములో చక్రబంధ – నాగబం

ధాదులు లేకపోయినను. బొత్తిగా చిత్రబంధకవితా లక్ష్యములు లేవనుటకు వీలులేదు. గోమూత్రాది బంధములు కొన్ని కలవనుట నిర్వివాదము. ప్రయోగము లీయ నక్కరలేదు.

ఇక వెంకణాదిత్యకవి గర్భకవితోదాహరణమందలి చిత్రకవితా బంధకాల మెప్పటిదో లెక్కింతము.

చ. 'కరి శిర మాడ షణ్ముఖుఁడు

..........................

గైపున వ్రేయుడుఁ గుంభపౌక్తి కో
త్కర మసి ధారఁ బొల్పె నఁగెఁ
దారకు భంగము సూచి నవ్వ సం
గర జయు కాంత కాంత రప
కాంతియె కాదని నాఁటుదీరి వి
స్ఫుర దవదాత ఖడ్గలత
పూచెనొ నా జయచైత్ర సంపదన్.'

—(కు. సం. 12-181)

ఇందలి రేఖాంకిత విషమగీత గర్భకవితను గుర్తించని విమర్శకులు కొంద 'రిందెట్టి గూఢతకు నవకాశము లే' దనుట విపరీతము. ఉన్న తారాగ్రహణ గణిత సమన్వయకాలమును లే దనుట సహేతుకముకాదు. వృత్తములో తారకు భంగమను కథ సరళముగా ఉన్నను, అందలి గర్భకవితోదాహరణమగు 'తారకవిత'లో ఎత్తుగీతి తారాగ్రహణకాలము గణిత సిద్ధాంత ప్రకారము లేకపోలేదు.

ఇందు కథ లే దనుటకు చిహ్నముగా సమస్థానమందలి 'శిరమాడ షణ్ముఖుఁడు' అను మొదటి చుక్కల పాదము కథా

నాయకుని పేరును సూచించునట్టిది కావున, అది కాల విషమ గీతములో చేర్చబడలేదు. విషమగీతములో విషమస్థానమందలి కడపటి ఎత్తుపాదము చేర్చి, ఎత్తుపాదముగల ఎత్తుగీతి పేరు సూచింపబడినది. ఎత్తు గద్యలక్షణమే, ఎత్తుగదియ, ఎత్తుగీది పేర్లుగా మారినవి కాబోలనిపించుచున్నది.

ఇది ఎత్తుగీది కాదను పక్షములో కొలది సంస్కారము తో మరల అది నూతనావతార మెత్తుచున్నది.

ఎత్తుగీతియొక్క ఆద్యంతములందలి 'మ్ - న్' అను మకార - నకార పొల్లులు లోపించినయెడ లా ఎత్తుగీతి మరల ద్విరదగతి రగడయై పిమ్మట జంపెరగడయై తద్వాత ఖడ్గబంధముగా కూడ మారుచున్నది.

'మహాక్తి కోత్కర మసిధార' అను సంధివాక్యలో 'మహాక్తికోత్కరము + అసి ధార' అను విగ్రహరూపము చిత్రబంధ కవితకు యతి మైత్రిని చేకూర్చుచున్నది. ఇంతే కాక, ఖడ్గగతి బంధము పేరును సూచించుచున్న దందలి 'అసి' ధారాపదము. 'మన తెలుఁగు ప్రబంధములలో వెదకిన మొట్ట మొదట ఇట్టి చిత్రరచన చేసినవాఁడుగా ప్రసిద్ధుఁడు జక్కన తాత పెద్దయ.' అనుట సరికాదు. కాలముగల చిత్రకవితా లక్ష్యము అన్యోన్యతారకముగా ఉన్నను, దానిని ఘుణాక్షర పద్య కాలమనుట చిత్రాతిచిత్రవాదమే కాని, భాషా నిదర్శన కాలవాదము కాదు. నూత్న ఖడ్గబంధ లక్ష్యము.

ల్పైబా | తలడ్గషు తదావ
'అసి' ధారః | (జయ) కాంతకాంతర(ద).'
సఃగె; | చైత్ర సంప

ఈ ఖడ్గ బంధచిత్రము నన్నిచోడకవి చరిత్రలో ప్రకటింపబడినది. ఇందెట్టి కథ లేదు; కాలము మాత్రమే కలదు.

'జయ – ఏకాదశ భావ – ౧౧, కాంత – చంద్ర – ౧, కాంత – చంద్ర – ౧ (రేఖలను), రదత్ .. లిఖించుచున్న, అసదాత – శ్వేత – శుద్ధ, ఖడ్గలత (రెల్లు) – క్షురిక – కృత్తిక, (జయ – 3 – తిథి వారము లనగా) తదియా, మంగళవారములు.'ఖడ్గలత–కృత్తిక జయసంవత్సర చైత్రమాస లక్ష్మియందు అసి – ఖడ్గబంధ గతితో స్థిరముగా నెలకొనె' ననుటకే ఖడ్గ విక్రమశక బంధము సమకాలమగుచున్నది. విక్రమ శకవర్షములు వామగతిగా మారినను ౧౧౧౧ చంద్ర రేఖల వ్రాతకాలము మారదు.

లెక్కప్రకార మీ చోడకవిరాజు రచించిన గర్భచిత్ర బంధకాలము వి. శ. ౧౧౧౧ వర్షంబులగు నేటి జయసంవత్సర చైత్రమాస, శుద్ధపక్ష, తదియాతిథి, మంగళవార, కృత్తికా నక్షత్ర, అభిజిల్లగ్నకాల సంపదగా లెక్కింపబడినది. మరెట్టి కాల మిందు సమన్వయ మగుట లేదు. ఈ ఖడ్గబంధ రచన క్రీ. శ. 1054 సంవత్సరము మార్చి నెల 15 తేదీ మంగళవారము మధ్యాహ్నము 12 గంటలప్పుడు అభిజిల్లగ్నములో జరిగినట్లు కృత్తికానక్షత్ర ప్రవేశము సూచించుచున్నవి.

'ఉండు' ధాతుపరిణామ వర్తమాన క్రియారూపములు కూడ పై చిత్రకవితా కాలమును దృఢపరచుచున్నది.

పురాతన శిలాశాసనములందును, నన్నిచోడ-నన్నియ భట్ట కవు లిద్దరు తమ కావ్యాలం దంతటను 'ఉన్నవాఁడు-ఉన్న వారు' అను వర్తమాన పూర్వక్రియలను నిత్యవిధిగా ప్రయోగించియుండగా, తదర్వాచీన కవులైన తిక్కన - కేతన - పాల్కురికి సోమన - నాచన సోమన మొదలగు కావ్యకర్త లందరు 'ఉన్నవాఁడు – ఉన్నాఁడు; ఉన్నవారు – ఉన్నారు' అను ద్వివిధవర్తమాన క్రియలను వైకల్పికముగా ప్రయోగించి, తమ కాలమునాటి పురాతన – నూతన క్రియాపరిణామ చరిత్రను వెల్లడించిన సంగతి భాషావాదులు విస్మరించిరేమో తెలియదు. ప్రయోగములు నన్నిచోడకవి చరిత్రలో వివరింపబడినవి.

భాషాతత్త్వవేత్తలు పెద్దచెరుకూరు శిలాశాసనాదులందలి 'చోడబల్లి –నన్నిచోడ' అను తండ్రి కుమారుల చరిత్ర కావ్యకర్త వంశక్రమముగా ఉన్నను, అనుమాన ప్రమాణముగా కూడ తత్కవిపురుషాంతర కాలము క్రీ. శ. 1028–58 ప్రాంతమని అంగీకరించక పోవుట చారిత్రక పద్ధతి కాదు. శాసనకాల పట్టిక నన్నిచోడకవి చరిత్రలో వివరింపబడినది.

'అయ్యుదయనగ' గీతమందలి దేశకాల వ్యంగ్యగణిత మీ కందుకూరు పాకనాటి చోడవంశ శిలాశాసన చరిత్రను బలపరచుచున్నది. గీతి వ్యంగ్యగణిత చరిత్రలో 'అయ్యుదయ

గిరి; పాకనాటియం దిరువదియొక్క వేయి' (గ్రామముల) పెంప కము; శా. శ. ౯౦-౯౯ (వర్షంబుల)' తీసివేత లెక్కించబడి యున్నట్లు తదితర వ్యంగ్య సంఖ్యా చరిత్ర తార్కాణించు చున్నది. 'పాకనాఁ డిరువదియొక్క వేయిటికధీశుఁడు, (1-53)' 'శుభోదయము - ప్రతిష్ఠింతు' అను దేశకాల సంఖ్యాచరిత్ర సూచన కలదు. లెక్కలు నన్నిచోడకవి చరిత్రలో లెక్కించి చూపబడినవి. 'పూర్వాబ్ధిలో వెల్వడి రవి మణి రుక్మాసమా నోదయాద్రి ప్రభుశృంగం బెక్కినట్లు' (కు. సం. 10-111) అభి నవభారవి ప్రస్తుకవిత కలదు. కుమారస్వామి పట్టాభిషేక వర్ణనయందలి 'ఉదయగిరి ప్రభు ప్రభుత్వము'; 'కని,గిరిపతి (8-47) - 'కనిగిరిపతి' శబ్దశక్తిచరిత్ర పాకనాటికవి కందు కూరు చోడవంశ చరిత్రను బలపరచుచున్నది. ఈ కవి వంశములో ఆరవతరము ముది-ముది మనుమనికి 'కందుకూరు పురవరేశ్వర-ఏకవింశతి సహస్ర గ్రామావనీ వల్లభ - పాకనాటి విషయ(ము)' తద్వంశాచార సూచకముగా క్రీ. శ. 1187-1227 ప్రాంతపు పెద్దచెరుకూరు శిలాశాసనములో చెప్పబడినది. పెద్ద చెరుకూరు దానము కమ్మనాటిలోని దేకాని, పాకనాటిలో చేరి నదికాదు.కమ్మనాటి చోడరాజు కందుకూరు పాకనాటి కధిపతి యనుట తచ్చోడవంశ ప్రశస్తి. నిజ రాజధాని కాదు.

క. 'ఉదయగిరి రాజ్య లక్ష్మికి
సదనము నెల్లూరు, అట్టి - సాధ్వీమణికిన్
పదసంబు కందుకూరగు.'

—చాటువు

(భారతి, జూన్, 1959 సంచిక, 85 పుట.)

పూర్వకాలమున కందుకూరు, కనిగిరి, నెల్లూరు పాక నాడులు ఉదయగిరి పాకనాటి రాజ్యమునకు చెందిన వనుట కాక్షేపములేదు. స్కందపురికవి స్కందసంభవ మనగా కుమారసంభవము రచించె ననుటకు కందుకూరు స్కందప్రకృతి తోడ్పడు చున్నది.

చాళుక్య వంశ ప్రశస్తిలో 'కార్తికేయ పరిరక్షణ ప్రాప్త కల్యాణ పరంపరాణాం - చలుక్యానాం కులమ్' ప్రస్తావనకలదు. కావున, తత్సామంతకవి కార్తికేయ సంభవమనగా కుమార సంభవము రచించె ననుటకును వీలున్నది. లేక, కడప రేనాటి చోడవంశమందలి 'పుణ్యకుమార' చోడమూలపురుషుడే తన తెనుగు చోడవంశ మూలపురుషుడగుటచేత 'పుణ్యకుమారసంభవము నే కుమారసంభవము'గా చోడకవి రచించె ననుటకును వీలున్నది.

కుమారసంభవ కథలో 'బృహత్కథాది' (12-215) గ్రంథములు పేర్కొన్నను, తన్నామమును బట్టిచూడగా అది క్రీ. శ. 1060-80 ప్రాంతపు సంస్కృత 'బృహత్కథా మంజరి' కాదనియు, అతి ప్రాచీన కాలపు పైశాచిక (ప్రాకృత) 'బృహత్కథ'యే క్రీ. శ. 11 శతాబ్దములో ఎక్కువ ప్రచారమందుండెడి దనియు చెప్పక తప్పదు. ఆ కాలపు సోమదేవ భట్టు ప్రాకృత బృహత్కథను కథాసరిత్సాగర మనుపేర సంస్కృత కావ్యమును రచించి యున్నాడనుట సమకాలిక అనువాద భాషా ప్రశస్తి !

'కావ్యాలంకార చూడామణిలో (క్రీ. శ. 1259 నాటి) ఈశ్వరసూరి (చక్రబంధ) పద్ధతియే యున్నది. — — — ఇందువలన నొక విషయము తెలియుచున్నది. గీర్వాణాలంకారికుల పద్ధతులు ఆంధ్రదేశమున ఒక వాహినిగా ఒక్కమ్మడిగా ప్రవేశింపలేదని.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (పు 80)

గీర్వాణ ప్రాచీన చక్రబంధలక్షణము ఆదరించక పోయినను, కన్నడ కవిరాజమార్గ ప్రాచీన చక్రబంధ లక్షణము ఆదరించినట్లు నిదర్శనము లున్నప్పుడు చోడుని క్రీ. శ. 1054 తేదీ చిత్రకవితాకాలము ఘుణాక్షర న్యాయమని తోసివేయుట భాషాచరిత్ర కాదు. 'కన్నడ ప్రభావము ఆంధ్రకవిత్వముపై కవిద్వయ కాలమున అత్యల్పమే' —(వే. న. క. (219 పుట)- అను ఇట్టి యూహలు చెల్లవు.

గ్రంథాంతరంగిక వ్యంగ్యగణిత చరిత్రకంటె తద్గ్రంథాంతరంగిక భాషాప్రయోగములు ప్రబలప్రమాణములు కావు. గణిత - భాషా చరిత్రలు రెండును సమకాలికము లగునేకాని భిన్నకాలికము లగుతెట్లు విశ్వవిద్యాలయ

# తురుష్క పదములు

'వీనిని ('కైఁపు (కైపు); బాఁకు'లు) తోసిపుచ్చినను తరవారి శబ్దమును ప్రయోగించిన యొకపద్యము అల్లావుద్దీను చక్రవర్తిని గూర్చిన శ్లోకమును స్మరింపఁజేయుట చిత్రము.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (95 వుట)

ఈ నన్నిచోడకవి ప్రయోగములు అరబ్బీ - హిందీ భాషలలోనివే యైనను, సంస్కృత, ప్రాకృత భాషలలోను, తమిళ, కన్నడ, టాంధ్రభాషలలో కూడ వ్యవహరింపబడు చుండిన వనుట నిఘంటు సమ్మతము.

'కైఫ్'— అరబ్బీ పదము తమిళములో 'కయిప్పు' ; తెనుగులో 'కయిపు-కైఁపు' రూపములతో కలదు.

'బ్యాంక్'— హిందీపదము కన్నడములో 'బాకు' ; తెనుగులో 'బాఁకు' రూపములతో కలదు.

'తరవారి'— ('తరవార్, తలవార్' రూపాంతరము)-హిందీ పదము సంస్కృతములో 'తరవారిః' ; ప్రాకృతములో 'తరవారి', తెనుగులో 'తరవారి' రూపములతో కలదు.

ద్రావిడార్యభాషలలో చేరిన 'తురుష్క' శబ్దములు క్రీ. శ. 1300 – 16 ప్రాంతపు అల్లాయుద్దీను కాలమునాటివో, క్రీ. శ. 1175 - 92 ప్రాంతపు గోరీమహమ్మద్ కాలమునాటివో, లేక, క్రీ. శ. 1001 – 30 ప్రాంతపు గజనీమహమ్మద్ కాలము నాటివో స్పష్టముగా తెలియుటలేదు.

'ఇప్పటికి (క్రీ. శ. 1957 నాటికి) పదమూడువందల యేళ్ళ క్రిందనుంచే మన దేశానికీ - అరబ్బులకు వ్యాపార సాపారాలు జరిగేవి.'

—శ్రీ తిరుమల రామచంద్రగారు
(మన లిపి పుట్టు పూర్వోత్తరాలు, పుట 177)

ఇట్టి చారిత్రక సత్యమును విశ్వసించినచో మహమ్మద్ మహమ్మదీయ మతముతో పాటు క్రీ. శ. 657 ప్రాంతము నాటికే తురుష్కాయుధముల పేర్లు, బండ్ల పేర్లు, రక్షరేకుల పేర్లు భారతదేశమంతట వ్యాప్తిచెందిన వేమో యనక తీరదు.

'ఆనాటికి (క్రీ. శ. 1309 తేదీకి) ముస్లిందండు తెనుగు గడ్డపై అడుగు పెట్టలేదు.'

—శ్రీ తూమాటి దోణప్పగారు
(భారతి జూన్, 1959 - పుట 67)

'క్రీస్తుశకము పదకొండు, పన్నెండు శతాబ్దుల దాకా పడమట దేశాల తోడి హిందూదేశ వ్యాపార మంతా అరబ్బుల వశంలోనే ఉండేది.'

—శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు
(ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము 76 పుట)

ముస్లిములదోపిడీ లెక్కడజరిగినను, యాత్రికులవల్లనో, వ్యాపారులవల్లనో వారి ఆచార వ్యవహారాదులు, యుద్ధ పరికరములు భారతదేశమంతటా ప్రచారమగుటలో వింతలేదు. కనుకనే, దక్షిణదేశ భాషలలోని కా ముస్లిముల తురుష్క

శబ్దములు క్రీ. శ. 11 శతాబ్ది మధ్యకాలమునాటికి ప్రవేశించిన వనుట కల్పనకాదు. తెనుగు గడ్డపై తురుష్కులు పాదములు మోపకపోయినను, తురక పదములు వ్యవహరింపబడలేదనుట ప్రమాణ విరుద్ధము.

క్రీ. శ. 1053 ప్రాంతపు తెనుగు భారతములో క్రింది నన్నయ ప్రయోగములు కనబడుచున్నవి.

'తురుష్క పతు(లు)'.

—(సభా. 1 - 233)

'తురుష్క టెంకణ కొంకణ పతులు'.

—(సభా. 2 - 113)

'చిత్ర లలితగతి నొప్పు నేనూఱు 'గాడీలు'.

—(ఆది. 8 - 221)

కొందఱు 'ఏనూఱు గాడీలు' తురుష్క పదమును భారతము లక్ష్మీపతి వాఖ్యానుగుణముగా 'ఏనూఱు గాడిద లను' మూలపాఠము గాబో లనుట కలదు. సూర్యరాయాంధ్ర నిఘంటువు 'ఒక ప్రాంత ప్రతిలో గూడ ('గాడీలు') పాఠ మిట్లే యున్నది' అని సూచించియు, తురుష్కపదము ఆదరించక పోవుట చిత్రము.

'కనక రత్న రచితమై తురగ సారథి సహితంబైన రథ
సహస్రమును ; — — —
చిత్రలలిత గతి నొప్పు నేనూఱు గాడీలు — —
అరణమిచ్చె — — .'

(ఆది. 8 - 221. సీ.)

ఇది శ్రీ కందుకూరి ముద్రిత పాఠము. కాని, దీని పాఠాంతరములు 'గాడీలు సింధుజ ; గాంధర్వ హయముల' అని రేఖాంకిత సూచిక. గాడీలు రథములు కావు. ఒకవిధమగు బండ్లు. వావిళ్ళప్రతి అచ్చుమూలములో క్రింది 'గాడిదల' పాఠము చేర్పబడినది.

'గతి నొప్పు నేనూఱు – గాడిదలను.'

వ్యాసభారత మూలములో 'అశ్వతర' అను తుల్య సంస్కృతపదమున్నను, తెనుగు కవి కీకంచర'గాడిద' పాఠము దేశీయము కాదని తోచి, మార్చియుండుట దోషముకాదు ; ఔచిత్యము. తెనుగునాటి పెళ్ళిళ్లలో కంచర 'గాడిదలు–అరణ మిచ్చు' ఆచారము కనబడదు. ఇట్టి మార్పులు నన్నయ భారతములో లేకపోలేదు.

తెనుగు భారతములో 'తురక' జాతి అన్యదేశీయ పదమును సంస్కృతీకరించి ప్రయోగించినప్పుడు లేని దోషము, ఆ తురుష్కభాషయందలి 'గాడీలు' అను అన్యదేశీయమును శబ్దశాసనుడు ప్రయోగించుటలో దోషము కలదా! వ్యాస భారత మూలములో 'తురుష్క'జాతి పద ప్రయోగము కలదో, లేదో వెతుకవలసియున్నది.

తెంకణాదిత్యకవి (చోడుని) మరణ కారణమును చాటుపద్యములో 'మడియడె – తెంకణాదిత్యుడనిన్.' అని వ్రాయుటయే కాక ; అధర్వణ కారికావళిలో ఆ 'కవిరాజ శిఖామణి' పేరును 'మతేః కవిశిఖామణేః' అని పేర్కొనుట

యే కాక, సంజ్ఞాప్రకరణములో 'అహేయ మన్య దేశీయం యత్త్ర దేవ ప్రయుజ్యతే' అను 'అన్యదేశీయ ప్రయోగ' లక్షణమును అథర్వణు డంగీకరించినాడనక తప్పదు. ఇట్టి అన్యదేశీయముల ప్రాచీన చరిత్రను గమనింపని విమర్శలు కొన్ని బయలుదేరుచున్నవి.

'తెనుగున 'తాయెతు' పుట్టుక నిన్న మొన్నటిది. పదునైదు శతాబ్దమునకు పూర్వ మిది మన భాషలో నుండెననుట కాధారణములు లేవు. ('తావిజ్ - తావీజ్' తెనుగున 'తావేదు' రూపము విదేశీయము). ఇదియే కాదు. అరబ్బీ, తురుష్క పారశీకా ద్యన్యభాషాపదము లేవియు ఆనాటి సాహిత్యమునగాని, శాసనములగాని కానరాదు.'

—శ్రీ తూమాటి దోణప్పగారు

(భారతి, జూన్ 1959 సంచిక, పుట. 6)

ఈ భాషా తత్త్వవేత్తలు ఇతరకవి ప్రయోగములనైనను చూడక, క్రీ. శ. 15 శతాబ్ది తురక భాషాచరిత్ర వ్రాయుట శోచనీయము.

నల్లగొండజిల్లా పానగల్లు శిలాశాసన ప్రశస్తిలో 'తురు(ష్కో) పప్లవ మేదినీ సముద్ధరణ మహావరాహ - ప్రౌఢ ప్రతాప చక్రవర్తి శ్రీ శార్ఙ్గపాణి దేవ మహారాజుల - ప్రశస్తులు' పేర్కొనబడినవి. ఇది కాకతియ్య 'మనుమ'రుద్ర దేవ మహారాజుల కాలమునాటిది. ఇది క్రీ. శ. 1323 తర్వాతి కాకతీయ యుద్ధ జయ చరిత్ర కాబోలు.

'తర్కి' — ముస్లింజాతి పదమే సంస్కృతములో 'తురుఖః — తురుష్కః', తెనుగులో 'తురికి — తురక' రూపములతో కలదు. తర్కి దేశపు గుఱ్ఱము తెనుగు తురికి యైనది.

ప్రాచీన సంస్కృత నిఘంటువుల నైనను జూడక తరవారి - ('తరవార్ - తల్వార్)' — హిందీ తత్సమము క్రీ. శ. 1300 - 16 ప్రాంతము దని భాషాచరిత్రవేత్తలు బల్లగుద్దుట చిత్రాతిచిత్రము కద!

తురుష్క చారిత్రక విషయము లెట్లున్నను, క్రీ. శ. 11 శతాబ్ది మధ్యకాలములో 'తరవారి', 'కైప్రు' తురక పదములను, 'జొన్నలు' తెనుగు పదమును ప్రయోగించిన కవులెందరు కలరో పరిశీలించిన అన్యదేశ్య ప్రయోగచరిత్ర కొంతకు కొంత బోధపడును.

క. 'భూరి తరవారి వారి చ
యా రావానంత నాగ - హరిభూధర ల
క్ష్మీ రమణీ శోభితుఁడై
నీరధిపతిఁ బోలె వాహ - ని విభుఁ డచటన్.'

—(కు. సం. 11-15)

ఇట్టి శ్లేషప్రయోగములు మఱికొన్నిగూడ కలవు.

చ. 'మును మిడి వైరి వాహినుల
ముట్టి విడల్వఁ ద్రేసి సట్టికైఁ
పృ సఁ బయికెత్తు వాహకుల
పొంక మడం దల గొంత గొని ము

నెక్కొని వడియాలు పంటలను
గేవుల నూరెలఁ బోలి నూర్చు పే
ర్చునఁ (బతికెత్తి) కే ల్గలుగ
జొన్నలుగొన్న ఋఋంబు నింగుఱుకా.'
— (కు. సం. 11 - 42)

ఈ నన్నిచోడకవి తెనుగుకావ్యమును పఠించిన దాక్షిణాత్యపండితుడు యాదవప్రకాశుడు తనసంస్కృత నిఘంటువులో పై హిందీ - తెనుగుపేర్లను పేర్కొనియుండగా, భాషావాదు లీవైజయంతీ ప్రమాణముల నైనను చూడక, తత్కాల నిర్ణయము చేయుట సబబుకాదు.

'చంద్రహాసోఽర్ధ చంద్రాగ్ర ఇతి తు కరవాలికా,
— — — — — — — — —
హారక స్తు రవాలిః స్త్రీ యష్టి ర్గ్రావ స్మృతౌ పృథా.'

* *

'శ్యామకం గుస్తుమధుకా యావనాలస్తు జొన్నలః,
జూర్ణాహ్వయా దేవధాన్యం జొన్నలా బీజ పుష్టికా.'
—వైజయంతి, భూమికాండ (117; 127 పుటలు)

భాషావాదులు కుమారసంభవమందలి రచనాకాలము అంగీకరించకపోయినను, క్రీ. శ. 1050 - 1100 ప్రాంతమందలి వైజయంతీ నిఘంటుకర్తకాలము అంగీకరించక తప్పదు.

ఈవైజయంతీ నిఘంటుకారుడగు యాదవప్రకాశ పండితుడు క్రీ. శ. 11 శతాబ్దములో విశిష్టాద్వైతమత స్థాపకుడగు

శ్రీమద్రామానుజాచార్యుల విద్యాగురువు కాబట్టి, తన్నిఘంటు ప్రయోగములైన 'తరవారి - జొన్నలు' అను హిందీ - తెనుగు పదములు క్రీ. శ. 11 శతాబ్ది ప్రయోగము లగునే కాని, భాషావాదులన్నట్లు క్రీ. శ. 13 శతాబ్దిప్రయోగము లగుటకు వీలులేదు.

క్రీ. శ. 11 శతాబ్దములో అథర్వణాచార్యులు చెప్పి నట్లు 'అన్యదేశీయ' పద ప్రయోగము నింద్యముకాదనుటకు 'గాడి' - 'తరవారి' - 'కైదువు' - 'బాకు' అను నన్నికవిద్యాయ ప్రయోగములు కలవు.

---

## బిరుదములు

'— — నన్నెచోడునికి సమీపకాలము వాఁడనియనఁ దగు బద్దెభూపాలుని నీతిశాస్త్రము (సకలనీతిసమ్మతమున) నుదాహరించియుండుట యొకవిశేషము. నన్నెచోడుని కాల మెట్లు వివాదగ్రస్తమైయున్నదో అట్లేయున్నది బద్దెన కాలమును. మఱి నన్నెచోడ - బద్దెచోడనరేంద్రులు (సకలనీతి సమ్మత సంగ్రహీత) మడికి సింగనకు పూర్వులు. అందు నన్నెచోడుఁడు బద్దెన (నన్నెచోడుని)కన్నను పూర్వుఁడని చెప్పవలసి యున్నది.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (82 - 83పుటలు)

శ్రీ వేంకట రాయశాస్త్రిగారు నీతిశాస్త్ర ముక్తావళి గద్యబిరుదచరిత్ర గుర్తించినట్లు లేదు.

'గద్య. ఇది లక్ష్మీవల్లభపాద పద్మారాధక కమలాప్త కుల పవిత్ర నన్ననగంధవారణ రాజమనోజ రాజాంక బద్దెనాఖ్య ప్రణీతంబు — — .'

కొన్నిప్రతులలో ఈగద్యలేకపోయినను, తచ్చరిత్రను బలపరచు మకుటసంబోధనలు లేకపోలేదు.

'రాజమనోజ భూభుజా.' (1-9) 'రాజరాజమనోజా.' (1-27) 'నన్నచోడనరేంద్రా.' (1-13) 'బద్దినరేంద్రా.' (1-7) 'నన్నన గంధవారణా', (1-33)

ఈ బద్దెన బిరుదాంక మేచక్రవర్తిదో గుర్తించినచో అతని సామంతకవి దేశకాలచరిత్ర కొంతకుకొంత బోధపడుట కవకాశమున్నది.

క్రీ. శ. 1019 - 1060 మధ్యకాలమందలి వేంగీపూర్వ చాళుక్య చక్రవర్తియగు రాజరాజనరేంద్ర విష్ణువర్ధనునకు 'రాజమనోజ - భూపతీ' (ఆది. 8 - 324) అను బిరుదాంక మున్నందున, తెనుగు భారతసంహితారచయిత నన్నయభట్టు తదాశ్వాసాంతములో ఒక్కమారు సంబోధించినందువల్ల, ఆ '(రాజ) రాజమనోజ భూభుజాంక - రాజరాజ మనోజ రాజాంక' సామంత కావ్యచతుర్ముఖుని కాలము తత్సమ కాలమనికాని, తదనంతర కాలమనికాని చెప్పకతప్పదు. ఇట్లు కాలసాధనమున్నప్పటికిని 'గ్రంథమునుబట్టి యాతని కాలము నిర్ణయించుట కవకాశములులేవు.' అని కవితరంగిణీ చరిత్ర కారుడును, భాషా వాదులును నిశ్చయించుట పొరపాటు.

ఇంతవు గ్రంథాంతరంగిక సాక్ష్యమునుబట్టి క్రీ. శ. 1054 తేదీకుమారసంభవ కావ్యకర్త నన్నిచోడకవి బ్రహ్మాయు, క్రీ.శ. 1054–84 నాటి నీతిశాస్త్ర ముక్తావళికర్త బద్దెన నన్నెచోడకవి బ్రహ్మాయు క్రీ. శ. 11 శతాబ్ది తెనుగుకవులుగా కనబడుచున్నారు.

అంటే —

ఇతను వేంగిప్రభువగు (మొదటి) ఒమ్మడి రాజరాజు (రాజరాజ మనోజరాజాంకుని) సామంతుడో, ఇతని మనుమడు ఇమ్మడి రాజరాజు సామంతుడో కాకపోడు.

దీనికి ప్రమాణము —

'శాకాబ్దే రసఖాంబరేందు గణితే – – రాజ్యాభిషిక్తో – – – శ్రీరాజరాజో విభుః.'

— టేకి శిలాశాసనము

(భారతి, జూలై, 1952 సంచిక.)

క్రీ. శ. 1084 తేది వేంగిచాళుక్య రాజ్యమునకు పట్టాభిషిక్తుడైన మనుమ రాజరాజున కీ 'రాజమనోజ – విష్ణువర్ధనభూపతీ' బిరుదము లేకపోయినను, తాతబిరుదము నాతనిమనుమడుకూడ దరించినాడు కాబో లనుట కవకాశ మున్నది. వంశాచారము.

మెకంజీ సంపుటములలోని చిత్తుశాసనమందలి 'వేంగి చాళుక్యమూలస్తంభ – బద్దచోళనరేంద్ర' ప్రశస్తి పై వేంగి చాళుక్య రాజ్యాంకచరిత్రకు చక్కగా సరిపోవుచున్నది. మరియు, ఈచిత్తుశాసనము 'భువనైకమల్లు' కాలమునాటి

దని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసినట్లు ఆంధ్ర కవి తరంగిణి సూచించుచున్నది.

ఈనికాలము క్రీ. శ. 1250 ప్రాంతమనుట కవకాశము లేదు. క్రీ. శ. 1068 – 76 మధ్యకాలమందలి ద్వితీయ సోమేశ్వరునికి 'భువనైకమల్ల' బిరుదముకలదు కాబట్టి, క్రీ. శ. 1054 - 84 ప్రాంతమందలి వేంగిచాళుక్య 'రాజరాజ మనోజ రాజాంకు'ల కాలము 'నన్నన గంధవారణ రాజమనోజ రాజాంక బద్దెన' కవికాలమనుట సమకాల సమన్వయము.

పై వేంగి చాళుక్య 'రాజమనోజ రాజాంక' చరిత్ర కాలమును, కల్యాణీ చాళుక్య భువనైకమల్లునికాలమును సమన్వయ పరిచిన యెడల 'కృష్ణవేణా నదీతీర దక్షిణ షట్సహస్ర (వెలనాటి) విషయాధీశ్వర వీరమహేశ్వర వేంగిచాళుక్య మూల స్తంభ నన్నన గంధవారణ బద్దె చోళనరేంద్ర – లక్ష్మీవల్లభ పాదపద్మారాధక కమలాప్తకుల పవిత్ర నన్ననగంధ వారణ రాజమనోజ రాజాంక బద్దెనాఖ్య' శాసన గద్య చరిత్రలకు క్రీ.శ. 1054–84 ప్రాంతము సమకాలమగుననుట కాక్షేపము లేదు. కాని వెలనాటి చోడవంశ ప్రారంభకాలమునకు ముందే బద్దెనచోడుని కాలముండుట శ్రేష్ఠము.

చిత్తుశాసనములో 'వీరమాహేశ్వర' మతమును, నీతి కావ్యగద్యలో 'లక్ష్మీవల్లభ పాదపద్మారాధక' మతచరిత్రకును మధ్య భేదము కనబడుచున్నది. బద్దెనవీరశైవమును విడనాడి, వీరవైష్ణవమును స్వీకరించినాడనియో; లేక, సమదృష్టితో అద్వైతము నాశ్రయించెననియో చెప్పుట మతద్రోహముకాదు. నన్నిచోడకవి శివాద్వైతికద!.

మఱి 'నన్ననగంధవారణా' యను బిరుదమున్న దే దాని కే మర్థమన్న నన్నన యనువానికి గంధవారణమువంటివాఁడు, గొప్పసంరక్షకుడనియర్థము. ఇదికన్నడబిరుదము. (మానవల్లి) కవిగారు "అమ్మనగంధవారణాం, మల్లన గంధవారణాం' అను బిరుదములను పేర్కొని అవేవో 'తెలియరాదు' అని వ్రాసినారు. కన్నడరాజ్యములో ఈబిరుదు సర్వసామాన్యము; రన్న పంప పొన్నకవుల గ్రంథములలో కనఁబడును.

అమ్మనగంధవారణ మనుటకు తండ్రికి ఏనుఁగువంటి వాఁడని యర్థము. ఈ అమ్మకు 'అయ్య' యని యర్థము. కృష్ణమనాయుఁడు ఇత్యాదులలోని అమ్మవంటిది, మర్యాదా వాచకము, మానవునికి సహాయముగా వెంటనొక యేనుఁగుండిన నెట్లుండునో అట్లు సహాయుఁడుగా అనుట. పశ్చిమ చాళుక్య శాసనములోనుండి లెక్కలేని యుదాహరణముల నీయవచ్చును.'

—వేపం సన్నిచోడుని కవిత్వము (84 పుట)

క్రింది శాసన పద్యచరిత్రను పరిశీలించినచో తెనుగు బిరుద లక్షణము బోధపడును.

క్రీ. శ. 1132 తేది గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా తూబాడు శిలాశాసనములో 'మణ్డనగంధవారణ' బిరుదమును, క్రీ. శ. 1320 ప్రాంతము పానగల్లు తెలంగాణా శాసనములో '(గూ) ర్జ్జర (ర) రాయవారణం' బిరుదమును స్పష్టముగాకలవు.

'కాపంయు జగజ్జిగిషుంయు,
శా. తన్నుగ్గించుచు నెత్తి మంతన్ను బుధా
ధారుంయు వన్నంగ నమ్మన్నె (ట)ం
గనయుంబుల త్రిపురులకు
న్మాపన్నెట్టియొడించ్చి పె
కొఱన్ను న్ముణ్ణనగంధ వారణసమా
ఖ్యంజేసి తూంబత్తిపై
నెన్నత్రివ్వెత్తిగ నాతుకూరు దయతో
నిచ్చె న్నిజస్వామియును.'

—శాసనపద్యమంజరి
(2 భాగ., 2 - 3 పుటలు)

యుద్ధభూమిలో జయలక్ష్మినిచేకొన్న సేనానికి ఎఱ్ఱమండ రాజు 'గన్ధవారణ' బిరుదసత్కారము చేసినట్లు శాసనపద్య చరిత్ర తెలుపుచున్నది. 'గజసాహిణి' గౌరవనామము 'గంధ వారణ' బిరుదాంకము కాబోలు. 'ఘూర్జర రాయవారణం' బిరుదులోని 'వారణ' శబ్ద మీ గజసాహిణి పర్యాయార్థము నివ్వగలిగియున్నది.

విశ్వకోశములో వీటికి 'గంధో---సంబంధగర్వయోః; ప్రతిషేదే స్యా ద్వారణశ్చమతంగజే'అను నానార్థములుకలవు. పై శ్లేషార్థమునుబట్టి చూచినచో ఈ బిరుదునకు '(నన్నన) నన్నిచోడునికి (గంధ) సంబంధించిన (వారణం) గజసాహిణి. లేదా, 'నన్నిచోడునియొక్క గర్వమును నివారించినవాడు.' అను మిత్ర - శత్రుసంబంధములు కనబడుచున్నవి.

ఎట్లయినను 'నన్ననగంధవారణ' మనగా 'నన్నిచోడ గంధవారణ' చరిత్రతో సమన్వయమగును. నకారపొల్లు చమత్కారముతో 'న(అ)న్నిన - గీతి' కవి సూచన కావ్యములో

సూచింపబడినది. 'అన్నిన' విశేషణము నకారపొల్లునతో చేరి నన్నినచోడుని గీతి పేరు వ్యంజకము చేయుచున్నది.

'ఇందుచే నన్నెచోడ బద్దె (నన్నె) చోడనరేంద్రులిరువురు నొకరివెంటనొకరు రాజ్యమేలిరో జీవించిరో యుండవలెను.'

—వేదం న. క. (85 పుట)

ఈ భాషావాదమునుబట్టి చూచినను నన్నిచోడుని కాలము క్రీ. శ. 11 శతాబ్దమునుండి క్రీ. శ. 14 శతాబ్దమునకు మారదు.

భారతపద్యమందలి 'రాజమనోజ – – – విష్ణువర్ధన భూప(తి)' (ఆది, 8 - 323) బిరుదమును, నీతిసారమందలి 'రాజమనోజ రాజాంకబద్దెన' బిరుదమును క్రీ. శ. 11 శతాబ్ద సమకాలికచరిత్రను సూచించుచున్నవనుట సామంతకవి రాజాంకము. వేంగి రాజరాజ మనోజుడు - వెలనాటి రాజరాజ మనోజుడు ప్రాచ్యచాళుక్యసామ్రాజ్య సామంతచరిత్రను స్మరింపజేయుచున్నారు.

క్రీ. శ. 1076 నాటికి ముందు వెలనాటి చోడరాజ్యము-వేంగిచాళుక్యరాజ్య మూల స్తంభ – రాజమనోజరాజాంక–బద్దెన నన్నెచోడనరేంద్రుని వంశమునకు చెందినదై యున్నట్లు శాసన - కావ్యచరిత్ర బలపరచుచున్నది. నిదర్శనము లున్నప్పుడు చిత్తు శాసన ప్రమాణము అంగీకరించుట తప్పుకాదు. అటుతర్వాత మొదటి గొంకరాజు వెలనాటి చోడవంశము నెల

కొన్నది. ఈ వెలనాటి చోడవంశములు రెంటికిగల సంబంధము తెలియదు. తెలియకపోయినను, వేంగిచాళుక్యుల కీవెలనాటి చోడులు సామంతరాజు లనుట నిక్కము. వెలనాటి ఆరువేల నాడు చారిత్రక సంశయములు నివారించిన జగమెరిగిన చారిత్ర కులు (శ్రీ) మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి ధన్యవాదములు.

క్రీ. శ. 11 శతాబ్దములో నన్నెచోడన రేంద్రకవు లిద్దరు నన్ననగంధవారణులై నన్నయ భారతముతోపాటు కావ్యరచన సాగించినట్లు భాషాచరిత్ర తెలుపుచున్నను, భాషా వాదులీచరిత్రను గుర్తించక కాబోలు 'నన్నెచోడుని కాలమెట్లు వివాదగ్రస్తమైయున్నదో అట్లేయున్నది బద్దెనకాలమును' అనితృప్తిపడి, తమకల్పితభాషాచరిత్రతో క్రీ. శ. 11 శతాబ్ద చోడకవిచరిత్రను క్రీ. శ. 14 శతాబ్ద చోడకవిచరిత్రగా తారుమారుచేసినారు.

క్రీ. శ. 11 శతాబ్ది వేంగి తెనుగుకవులలో 'భారతి ఘోరరణంబు' వంటి భాషాయుద్ధము జరిగినట్లు 'నన్నన గంధ వారణ' శ్లేష చరిత్ర బలపరచుచున్నది. నన్నయభట్టుయొక్క గర్వము నణచినవాడు బద్దెన నన్నన గంధవారణు డనుట కును వీలున్నది.

'ఇందువలన నాకుతోఁచున దేమనఁగా బద్దెన నన్నె చోడుని ఎఱిఁగి ఆతనిపై భక్తిగలిగి తానును కవితలో అట్టి వాఁడనని తన్ను ఆ పేరిటసంబోధించుకొని, ఆతనికి సామం తుఁడో కుమారునితో సమానుఁడైన భృత్యుఁడో, లేక ఎట్లో సన్నిహితుఁడై యుండి అందుచే నన్ననగంధవారణుఁడనికూడ

సంబోధించుకొన్నాఁడు. ఇందుచే నన్నెచోడ బద్దెచోడులిరు వురును ఒకరివెంటనొకరు రాజ్యమేలిరో జీవించిరో యుండవలెను.

ఈయూహను బలపఱచునాధారము కాకపోయినను నుఱింతయనుకూల పఱచువిషయము – – – .'

—వేదం నన్నెచోడుని కవిత్వము (82-83 పుటలు)

(శ్రీ) రాయశాస్త్రిగా రూహించి నట్లే క్రీ. శ. 11 శతాబ్దములో నన్నిచోడకవులిద్దఱు సమకాలికులై శత్రువులుగానో, సంబంధ మిత్రులుగానో వేంగిచాళుక్య చక్రవర్తులక్రింద జీవించి రనుటకు 'నన్నగంధవారణ బద్దెన నన్నెచోడనరేంద్ర' బిరుద చరిత్ర సాధకమగుచున్నది. 'న(అ)న్నిన షట్పదమంజు గీతి' (కు. సం. 4–102) వ్యంగ్యకవి నన్నినచోడునితో బద్దెన నన్నిన చోడుడు పోటీపడుట; కులసంబంధము; కవితాసంబంధము.

క్రీ. శ. 1028 – 58 ప్రాంతమందలి జాను తెనుగు కుమారసంభవ కావ్యకర్త నన్నిచోడ తెంకణాదిత్య కవిరాజ శిఖామణికిని, క్రీ. శ. 1054 - 84 ప్రాంతమందలి చాళుక్య రాజరాజమనోజరాజాంక నన్నగంధవారణ బద్దెన నన్నెచోడ కావ్యచతుర్ముఖునికిని మధ్యవిశేష కాలవ్యవధి లేదు.

క్రీ. శ. 1076లో మొదటి గొంకరాజు వెలనాటిలో నూతన రాజ్యమును స్థాపించుటకు పూర్వమే బద్దెన వెలనాటి చోడరాజ్యమును పాలించి, యుద్ధ నిహతుడయ్యె ననుట మెకంజీ లోకల్ రికార్డు శాసన చరిత్ర సమ్మతము.

క్రీ. శ. 1261 తేది కొండనాయనివర శాసనచోడ బద్దిగ వంశము బద్దెన కవివంశము కాదు.

నీతు లను నీతిశాస్త్ర ముక్తావళిని, సుమతిశతకమును రచించిన కావ్యకర్త బద్దెన నన్నిచోడుడును, ప్రబంధ కవిరాజు తెంకణాదిత్య నన్నిచోడుడును క్రీ. శ. 11 శతాబ్దమందలి భిన్న వ్యక్తులని చెప్పక తప్పదు.

ఇట్లయినచో క్రీ. శ. 11 శతాబ్ద మధ్యకాలములో నన్ని నారాయణ, నన్నియ భట్ట, నన్నిచోడ, బద్దెన నన్ని చోడకవులు సమకాలికులై 'నన్నికవి చతుష్టయము - నన్ని కవి చతుర్ముఖులు'గా విఖ్యాతులైనారన వీలున్నది.

---

## నాటకములు

క్రీ. శ. 11 శతాబ్దములో రచించిన తెనుగునాటకములు లభించకపోయినను, తద్వర్ణనలైనను కలవేమో చూతము.

'నాటకప్రయోగంబునుంబోలె ఘనరసపాత్రశోభితరంగ రమ్యంబైన(ది).

—నన్నయభట్టు
(ఆది. 2-27)

మొదలి సూత్రధారుఁడై నాట్యాభినయము లెసఁగ నాడె. —(12-146)

నైపథ్యాగారంబు వెడలి లజ్జావతానన యగుచు.
—(7-137)

సురంగంబుగాఁగ నెఱయఁగ్గ సేసి జవనిక దెఱచివచ్చు చెలువు.
(9-46)

వాద్యములు సెలఁగ - -, తాలముల్ గా -, సంకీర్ణ రాగములు మొరయ, — — సల్లడంబులు గట్టి — — కులకంచెలలొనరఁ బెట్టి హాస్య బీభత్స భయానకరసముల్ — అభినయించి — రంగంబుగా- - -నర్తకీచయంబు నర్తించె - - చిత్ర మెసఁగ.'
—నన్నిచోడకవి
(కు. సం. 11-204)

చోడకవి ఈ నాటక లక్ష్యములను క్రీ. శ. 1054 తేది కుమారసంభవకథలో పద్యనాటికలుగా వ్రాసినట్లు క్రీ. శ. 1951 నాటి నన్నిచోడకవి చరిత్రలో ఏర్చి కూర్చి చూపబడినవి.

---

# ప్రా స లు

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు 'ఏదియెట్లున్నను - - ఈతనిపద్యమునే నన్నెచోడుఁడు గ్రహించెనో చోడుని పద్యమునే యీతఁడు (రేచన) గ్రహించెనో ప్రస్తుతము చెప్ప లేము' అనుచు, క్రింది కందపద్యానుకరణ ప్రాసలను ఉల్లేఖించి యున్నారు.

'శ్రీశ్రిత వక్షుఁడు విద్యా
శ్రీశ్రిత ముఖుఁ డఖిల జన వి - శేషితకీర్తి
శ్రీశ్రిత భువనుఁడు సుకవి జ
నాశ్రయుఁ డెఱిఁగించుకృతుల - నగు దోషంబుల్.'

—రేచన (58 పుట)

'శ్రీశ్రిత పక్షుఁడు ముక్తి
శ్రీశ్రిత సహజావదాత - చిత్తుఁడు వాణీ
శ్రీశ్రిత సుముఖుఁడు కీర్తి
శ్రీశ్రిత దిఙ్ముఖుఁడు శేము - షీ నిధి పేర్మిన్.'

—నన్నిచోడకవి
(కు. సం. 7-1)

శ్రీ శాస్త్రిగారు గుర్తించి పేర్కొనని ప్రాచీన ప్రాసానుకరణములు కొన్ని లేకపోలేదు.

'మూఁడునే నినగణ - ములు రెండు నలములు
మూఁ డిన గణములును - మొగి నహంబు
పొందిగాఁగ నర్ధ - మునకు మీఁద ని
ట్లుండఁ జెప్పవలయు - నొగిఁ బ్రగీతి.'

—రేచన ఛందస్సు. జాత్యధి. (51 పుట)

క 'పొందిగ నగజ తపశ్శిఖి
మూఁడు జగంబులను దీవ్ర ముగఁ బర్విన బ్ర
హ్మాండము గాఁచిన కాంచన
ఖాండము క్రియఁ దాల్చెఁ దప్త - భా భాసితమై.'

—కు. సం., (6-157)

క. 'అంకగొన కుభయ బలములఁ
బొంకం బఱి తలరి పెలర - భువి గ్రక్కదలన్
వీంక మద కరులు రెండుం
దాంకె వడిం గొండఁ గొండఁ - దాఁకిన భంగిన్.'

—కు. సం., (12-68)

ఇట్లు పద్యప్రాసలలో 'దీర్ఘముమీఁద నిండుసున్న' పలుకుట యాతని (చోడుని) కాలములో వాడుకలో నుండినది. — — — దేశభేదమునుబట్టి తరగతిభేదమునుబట్టి యిప్పటికిని నిండుసున్న పలుకు నలవాటు కలదుగదా.'

—శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి పీఠిక (51 పుట)

'తేల్చి పలుకు నాచారముకూడ శిష్టలోకములో సన్నయ నాటికే ప్రబలియుండును.' అనుట కొక యుదాహరణము.

క. 'లోఁగుఁబరమైన పాపముల
నాఁగిన సకసంబు తలఁచు - నడుగడుగునకున్
వాఁగఁ గల సరయుఁ బ్రాణము
లీఁగుట కోపంగ మదనుఁ - డెంతయుఁ బ్రీతిన్.'

—నన్నిచోడకవి (5-13)

ఇవి నిండుసున్న లగుటకును వీలున్నది. 'వ్రాతప్రతిలోఁ గూడ నిండుసున్నయే వ్రాయఁబడి యున్నది. ముద్రణమునఁ గూడ లోంగు, ఆంగిన, దాంగ, ఈంగు - అనియే యుండవలసినది.

మొదటి ముద్రిత ప్రతిలోఁ గూడ నటులే కలదు. నాలుగుపాదములలో నున్నవి దేశ్యపదములే యగుటచేత నిప్పటి పద్ధతి నరసున్నయే పడినదిగాని వ్రాతప్రతిని బట్టి కవి యవలంభించిన సంప్రదాయమునుబట్టి నిండుసున్నలే యుండుట యుక్తము.'

—శ్రీ కో. రా. కృ. గారి పీఠిక (51 పుట)

మరియొకటి.—

క. 'పొంక సలిని రజస్వల
సోంకిన దోషంబు వాయ - సూర్యుండు గలితా
శంక సపరాంబు నిధిలోఁ
గ్రుంకె నొ కోయనఁగఁ బ్రొద్దు - గ్రుంకుడు నంతన్.'

—కు. సం., (8-88)

ఇట్టి ప్రాచీనపద ప్రాసాదులు రేచన - చోడన గ్రంథ ప్రయోగములలో స్పష్టముగా కనబడుచున్నవి. ఇవి నన్నయ వాడని ప్రాస విశేషములు.

'క్రీ. శ. 960-965 ప్రాంతమునకు (రేచనకు - చాళుక్య భీమ నాగ్రసుతుడు దానార్ణవునకు-వాచికాభరణునకు) ముందే గూఢ పద నామ గోపన' మున్నప్పుడు, క్రీ. శ. 1053-1054 ప్రాంతమున చోడ కవిరాజు పేర్కొన్న (దేశకాల గణిత) 'గూఢవస్తుమయ కావ్యము' లేదనుట విపరీతము.'

—తెనుగు తొలికావ్యము; కవిజనాశ్రయము,
(భారతి - అక్టోబరు, 1959.)

నన్నయ చెప్పినట్లు 'గూఢ - - కృతకము నేర్పడు నంత' (ఆది. 6—155) సత్యము గోచరించును.

---

# మంగళమహాశ్రీలు

'కావ్యమును మంగళమహాశ్రీవృత్తమున ఆమాటలతో ముగించుట (కన్నడకవులు) పంపాదులలో లేదు. కాని మంగళాంతమే. నన్నెచోడునిది ఇక్కడ కన్నడసాంప్రదాయముగా కనఁబడదు. పైఁగా తెనుఁగువారిది. తెనుఁగు ప్రబంధములలో నీయాచారము ప్రాచీనులలో లేదు. ఈతఁడు కొంత తర్వాతి వాఁడనుటకు 'మంగళమహాశ్రీ'చరిత్ర చక్కనినిదర్శనము.'

—వేదం నన్నెచోడుని కవిత్వము (221 పుట)

ఈవిషయము చర్చించుటకుముందు తెలంగాణా శాసనములందలి దానకాలము లేని ఇనుగుర్తి శాసనమందలి మంగళాంతకాలచరిత్రను పరిశీలించు టావశ్యకము.

'స్వస్తి శ్రీమతుకాకతీయ ప్రోలమహాదేవులు యినుంగుఱితిని వాయివ్యపుపర్వతము (నందు) జలంధరేశ్వరభైరవునిం బ్రతిష్ఠసేయించె మంగళమహాశ్రీశ్రీ.'

—కాకతీయ శాసనములు (పుట 4)

ఇందలి 'మంగళమహాశ్రీ; శ్రీ' కాలము క్రీ. శ. 1022 – 76 ప్రాంతమందలి మొదటి కాకతీయ ప్రోలరాజు కాలము నాఁటి దనుట నన్నిచోడకవి సమకాలచరిత్ర. దీని లిపి వైఖరి కాలము తెలియదు.

ఎట్లయినను, తెంకణాదిత్యకవిరాజు 'మంగళమహాశ్రీ' వృత్తముతో కుమారసంభవకథను ముగించియుండగా; కాకతి ప్రోలమహారాజు 'మంగళమహాశ్రీ, శ్రీ' వచనముతో ఇనుగుర్తిశాసనము ముగించియుండగా; ఇతనిమనుమడు దుర్గనృపతి 'దారిద్ర్య విద్రావణ' బిరుదాంకితుడు 'మంగళమహాశ్రీ'

కన్నడవచనముతో క్రీ. శ. 1097 తేది ఖాజీపేట శిలాశాసనము చెక్కించియున్నాడు.

'నిజకులకీర్తిస్తంభ స్వరూపమాగె నిలిసిద శాసన గంభమి దాచంద్రార్క తారం నిల్కె. మంగళమహాశ్రీ.'

—నన్నెచోడకవి చరిత్ర,
(అనుబంధము, పు. 242)

ఇట్లిక్కడ తెనుగు శాసన సాంప్రదాయముతో పాటు, అనుకరణ కన్నడ శాసన సాంప్రదాయము క్రీ. శ. 11 శతాబ్దములో కనబడుచున్నను, భాషావాదులీ 'మంగళమహాశ్రీ'ల కాలము క్రీ. శ. 1200కు తర్వాత కనఁబడి 1300నుండి హెచ్చినకాలమనుట భాషావాద వైపరీత్యమేకద!

క్రీ. శ. 11శతాబ్ది మంగళమహాశ్రీ వృత్తకాలము క్రీ. శ. 14 శతాబ్దికి మార్చబడినట్లే, క్రీ. శ. 11శతాబ్ది మధ్యాంత కందపద్య చరిత్ర, క్రీ. శ. 14 శతాబ్దికి మార్చబడినదనుట భాషావాద పరిణామకల్పనయేకద!

తెనుగుతొలికావ్యమనదగు కవిజనాశ్రయ ఛందస్సులో యతి-అధికారము చివర (ఒకటి రెండు పద్యములకుముందు) మంగళమహాశ్రీ వృత్తము కూర్చబడియున్నది.

'శ్రీమహిత! లోకహిత! - శిష్టజనసేవిత! వి - శేషగుణ! మంగళమహాశ్రీ నామమగు(ౘ) — — — — — — — .'

—రేచనఛందస్సు, (32 పుట)

జైనకవి రేచన ప్రాచీన లక్షణములను శైవకవి-చోడరాజు మక్కికిమక్కిగా కాకపోయినను, స్థూలముగా అనుకరించినాడనుట కాలక్రమ ప్రాచీనలక్షణము.

# సారాంశములు

'నన్నెచోడుని కాలమును (భాషావాదనిదర్శనములను బట్టి) ఇంతకు తర్వాత కొనిపోదగునా రాదా అను ప్రశ్నకు సమాధానము కుదురకున్నది. క్రీ. శ. 1340 లేక 1323 లేక 1300 ఈమధ్య కుదురునా లేక 1350 తర్వాతికి కుదురునా యతని కాలము అను ప్రశ్నకు ఈవలి హద్దును ఒక విధముగా కుదుర్చుకొనవచ్చును.'

—శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారు (న. క. 81 పుట)

ఈ భాషావాదములో తత్కృతికాల సాక్ష్యమున్నను, దానిని తిలకింపని నిదర్శనము లనేకము కలవు.

చోడరాజకవి ప్రతిజ్ఞయందలి శా. శ. ౯౭౫ – (క్రీ.శ. 1053)–గ్రహకాలము కుమారసంభవ భాషా సమకాలమనుట 'దైవజ్ఞ'గీతి గణిత సమ్మతము.

కుమారసంభవ కథలో నాగబంధమందలి 'సమస్తగ సోమదేవ' స్తుతి కృతిపతు లందరికి సమన్వయమగుచున్నది.

జంగమ మల్లయ సోమ మనుష్యరూప (సోమదేవ)గురువునకు, శ్రీపర్వత మల్లయ సోమాత్మమూర్తి (సోమదేవ) దైవమునకు, కల్యాణి త్రైలోక్య మల్లయ సోమేశ్వరదేవ (సోమదేవ) చక్రవర్తికి అభేద రూపకముగా వ్యక్తిభేదము నిరూపింపబడినది.

ముగ్గురు మల్లయ్యాలనే ముగ్గురు సోమదేవులు కృతిపతులు. 'అలంకారము గూఢవస్తువు'గా ఉన్నప్పుడు రూపక చరిత్రను విభజించి గుర్తించుట తప్పుకాదు.

కృతిపతులు సోమదేవులు ముగ్గురు క్రీ. శ. 1044–68 ప్రాంతమందలి మల్లయ సోమదేవు లనుట కళ్యాణి పశ్చిమ చాళుక్య చరిత్ర సమ్మతము.

షష్ఠ్యంత కందపద్యములు కృత్యాదిలో మధ్యభాగమున వ్రాసిన మొదటి తెనుగు కవులు శైవులే కాని, అద్వైతులు కారు. ప్రాచీన శైవకవి చోడుని షష్ఠ్యంత కందపద్యములను అర్వాచీన శైవకవి మల్లికార్జున పండితారాధ్యుడు యథాతథముగా అనుకరించక, స్వతంత్రించి శతకానుగుణముగ కొంత మార్పు కావించె ననుట పరిణామ చిహ్నము.

'జయమగు మాహేశ్వరులకు సంతతము శివా.'

—శివతత్త్వసారము (18-20)

మొత్తము మూడు కందపద్యము లిట్టివే షష్ఠ్యంతములు. ఆశీర్వాద – సంబోధన లిందు అధికముగా చేరినవి. శివతత్త్వసార శతకములో షష్ఠ్యంతముల కవకాశము లేకపోయినను, అర్వాచీన శైవకవి ఆసక్తితో ప్రాచీనశైవకవి సాంప్రదాయమును ఆశ్వాసాంతాదులలో అనుకరించి స్థాపించినాడనుట ప్రాచీన లక్షణము.

నిర్వచనోత్తర రామాయణమందలి తిక్కన షష్ఠ్యంత కందపద్యములను భాషావాదులు గుర్తించి పేర్కొనలేదు. ఆ పద్యములను స్థలము మార్చికూర్చినచో, చోడకవి షష్ఠ్యంత

కందపద్యముల వంటివి – తిక్కన కందపద్యములు నిర్వచనో త్తర రామాయణ కృత్యాదిలోలో ఏర్పడుచుండగా, భాషా వాదుల కా కీలకము తెలియక, కేతనదగ్గర తిక్కన షష్ఠ్యంత ములను నేర్చుకొన్నాడనుట పరిణామ చరిత్ర కాదు.

క్రీ. శ. 1075 తేది దీర్ఘాసి శిలా శాసనమందలి

'ఇష్ట పూ ర్త కా ఫలము - లెల్ల కాలంబును
మెచ్చుతోడఁ దమకు - నిచ్చుచుణ్ణా.'

అను స ప్తసంతాన కాలమును భాషావాదులు గ్రహించక పోవుట చిత్రము.

'వీని నెల్ల భారత దేశమందు ఇష్టాపూ ర్తము లనిరి. వీనితో కావ్యములును నిర్మితము లగుచుండినవి.' అను వ్యాఖ్య భాషావాదు లెరిగినదైనప్పటికి, క్రీ. శ. 11 శతాబ్ది యందలి 'ఇష్టాపూ ర్త ఫలములు – స ప్త సంతాన ఫలములు' దీర్ఘాసి పద్య శాసనములో కనబడుచున్నను గు ర్తింపక, 'మఱి శాసనములలో కృతి స ప్తసంతానములలో నొకటి యని క్రీ.శ. 1130 నుండియు కనఁబడుచుండఁగా వాఙ్మయమున దాని ప్రశంస ఆతర్వాత రెండువందల శతాబ్దముల కా వచ్చుట యని ఆశ్చర్యము కలుగక మానదు. దీనికి కారణ మేమిగానుండును?' అని భాషావాదులు ఆశ్చర్యపడి ప్రశ్నించుట చిత్రము. క్రింది చింతామణి వ్యాఖ్యాన ప్రమాణములు వీరు చూచియుండినచో దీనికి కారణము కొంతకుకొంత గోచరమయ్యెడిది.

'అంకితాంశ్చ ప్రబంధాః; కావ్యే ష్వంకిత నామానః; కావ్యమ్ - స ప్తసంతాన(మ్).'

ఈ పురాణ శ్లోకము లెక్కడివో తెలియకపోయినను, క్రీ. శ. 1075 తేది 'ఇష్టాపూర్త ఫలములు – సప్త సంతాన ఫలములు' కాలముకంటె పూర్వప్రమాణము లనుట కాక్షేపము లేదు. ఇం దాశ్చర్య మేమిన్ని లేదు.

వేరొకటి—

క్రీ. శ. 1053 తేదీ నందమపూడి దాన శాసనములో నన్నయభట్టు (తన సహాధ్యాయి) నన్ని నారాయణకు 'ఆంధ్ర భాషా–కవిరాజ శేఖర–అష్టాదశావధారణ చక్రవర్తి' బిరుద మున్నట్లు వ్రాయగా, ఆ ప్రాచీనకాలమునాటి ప్రబంధములో నన్నిచోడరాజకవి 'వర్ణనాష్టా దశము' విస్తరించి వ్రాయుట దోషముకాదు.

నన్నయపేర్కొన్న 'అష్టాదశావధానము' లెట్టివో స్పష్టముగా మనకిప్పుడు తెలియవు. తెలియకపోయినను, ఆంధ్ర కవులిద్దరు సమకాలములో 'అష్టాదశ' వర్ణన ప్రబంధసంఖ్యను పేర్కొనుట నూతనమైనను, కల్పనకాదు.

కుమారసంభవములో కథేతరముగా ఉన్న రగడ చిత్ర కవితా కాలము 15–3–1054 తేదీ పంచాంగ సమ్మతమై ఉండగా, ఆ ఖడ్గబంధకాలము విశ్వాసయోగ్యము కాదనుచు, క్రీ. శ. 1279 ప్రాంతమందలి పెద్ద యామాత్యుని చిత్రకవితా కాలముతో చోడరాజకవి భాషాచరిత్ర కాలమును ఊహించుట చారిత్రక పద్ధతి కాదు. కవి ప్రతిజ్ఞాపాలన కాలమూ 'దైవజ్ఞ' గీతిలో సూచింపబడి ఉన్నను, ఆ గ్రంథావతారిక సూచన తిరస్కరించుట గణిత సమ్మతము కాదు.

గ్రంథాంతరంగిక ప్రమాణములు రెంటిలో భాషా వాద. చరిత్రను మాత్రమే నమ్మి, గణితకవి దేశకాలాది చరిత్రను నమ్మకూడదనుట పక్షపాత సిద్ధాంతమే కాని, నిష్పాక్షిక సిద్ధాంతము కాజాలదు.

అన్ని వాదములను సమన్వయము చేయు క్రీ. శ. 1054 తేదీ గర్భకవి రగడ కాలముకంటె, అన్ని వాదములను తిరస్కరించు క్రీ. శ. 1350 నాటి భాషాచరిత్ర కాలము ప్రబల ప్రమాణము కాజాలదు. గ్రంథ గణిత - భాషాకాలములు రెండు సమకాలికములు కావనుట ప్రాచీన భాషా పరిణామ చరిత్రకు విరోధము.

'ఉండు' ధాతు పరిణామ కాల మొక్కటే చోడరాజ కవి ప్రాచీన భాషాచరిత్రను స్థాపించుచున్నది. నన్నిచోడ – నన్నియభట్టు కవు లిద్దరు 'ఉన్నవాఁడు - ఉన్నవారు' అను వర్తమాన క్రియను నిత్యవిధిగా ప్రయోగించి యుండ, తక్కిన తిక్కనాది కవులందరు 'ఉన్నవాఁడు–ఉన్నాఁడు, ఉన్నవారు - ఉన్నారు' అను వర్తమాన క్రియారూపములను వైకల్పిక విధిగా ప్రయోగించుటకు హేతువేమో భాషావాదులు చెప్పుట లేదు!

ఇట్టి లోపము లెన్నో కల్పిత భాషావాదములో కన బడుచున్నను, భాషవాదు లీ భాషా నిదర్శన కాలదోషములను లెక్కించుట వింతపద్ధతి.

'- అంతయు క్రీ. శ. 1300 కొంచెము తర్వాతికి కుదురుచున్నది. ఈతని కావ్యమును చక్కగా విమర్శించి గ్రహించిన యెడల ఈ యభిప్రాయము సరియైనదని తోచును.'

—వేదం న. క. (97 పుట)

క్రీ. శ. 1050 - 1100 ప్రాంతమందలి యాదవ ప్రకాశ పండితుని 'తరవారిః' అను వైజంతీనిఘంటు తురుష్కపద ప్రయోగమును భాషావాదులు చూచియున్నచో, ఇట్టి భావ్య తారహిత సిద్ధాంతములు నిర్ణయించెడివారు కారేమోకద! ఈ క్రీ. శ. 11 శతాబ్ది నన్నిచోడుని 'తరవారి' క్రీ. శ. 14 శతాబ్ది అల్లాఉద్దీను కాలము నాటిదట! చిత్రము.

'ఇదంతయు (మంగమహాశ్రీ,) కన్నడమార్గమనుటకు ఆధారము బొత్తిగాలేదు.'

—వేదము వెంకటరాయశాస్త్రిగారు,

ఎమ్. ఏ, (న. క. 222 పుట)

నానన్నిచోడకవి చరిత్రానుబంధమందలి కన్నడ 'మంగళమహాశ్రీ' శాసనమును భాషావాదులు గుర్తించినట్లు కనబడలేదు. అది క్రీ. శ. 1097 తేదిఖాజీపేట శిలా శాసనము.

'శాసనగంభమి దాచంద్రార్కం తారంనిల్కె. మంగళమహాశ్రీ.'

—న. క. చ. (242 పుట)

ఇంతకు పూర్వమే క్రీ. శ. 11 శతాబ్దములో 'మంగళ మహాశ్రీ' వృత్తమును కావ్యాంతములో చోడకవి వ్రాసినట్లు జాను తెనుగు కవి రగడ కాలము తెల్పుచున్నది.

క్రీ. శ. 1097 తేదీ ఖాజీపేట శిలాశాసన 'మంగళ మహాశ్రీ' కంటె తర్వాతిది క్రీ. శ. 1054 తేది 'మంగళ మహాశ్రీ' కావ్యవృత్తమన వీలులేదు. భాషావాదులు తీర్మానించినట్లు తెనుగుమంగళ మహాశ్రీని కన్నడ మంగళమహాశ్రీ అనుకరించిన దనుట కాకతీయవంశ క్రమము.

అష్టాదశవర్ణనలతో కూడిన ప్రబంధము పదియెనిమిది మంది సదస్యులకు ఆశువుగా చెప్పుట అష్టాదశావధానము కావచ్చును.

ఇట్లెన్ని విధముల భాషాధారములను పరిశీలించి, చూచినప్పటికిని తేలినసారాంశము – 'సన్నిచోడుడు ప్రాచీనుఁడైన యెడల తానేడూహించికొని ఈచక్కని (ప్రబంధ) పద్ధతిని కుదుర్చుకొని యుండవలయును.'

—వే. న. క. (36 పుట)

* * *

' – – నన్నయకు ముందుండెనాయన్న నన్నెచోడునే స్మరింపని నన్నయ (ప్రాచీనశైవకవి) అంబన్నను స్మరించినా ?

—శ్రీవేదము వెంకటరాయశాస్త్రిగారు

(ఆంధ్రపత్రిక, 27-7-1958 తేది ఆదివార సంచిక.)

భాషావాదముల కిట్లు సందేహము లున్నప్పుడు, ఆ కల్పిత భాషాచరిత్రను చారిత్రకులు విశ్వసింపవలె ననుట వ్యర్థ ప్రయత్నము.

'నన్నెచోడుని కాలమును ఇంతకు తర్వాత కొనిపోదగు నా రాదా అను ప్రశ్నకు సమాధానము కుదురకున్న'ప్పుడు క్రీ. శ. 14 శతాబ్ది సందేహ భాషాచరిత్రను విడనాడి, క్రీ. శ. 1054 తేది గ్రంథ గణిత సిద్ధాంత వ్యంగ్యకవి చరిత్రను విశ్వసించుట మేలుకద!

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు తమ భాషావాదములో ప్రతిపాదించిన బద్దెన 'నన్నన గంధవారణ' బిరుచరిత్రకూడ తద్వ్యతిరేకముగా క్రీ. శ. 11 శతాబ్ది నన్నెచోడ కవిరాజు సమకాలమునే బలపరచుచున్నది.



# తప్పులు

| పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|
| 13 | శతాబ్ది | శతాబ్ది |
| 17 | 12–1–13 | 12–13 |
| 12 | చెల్లినది | చెల్లినది; |
| 12 | మల్లిఖార్జున | మల్లికార్జున |
| 14 | ,, | ,, |
| 17 | వాచ్యముకా | వాచ్యముగా |
| 14 | మల్లిఖార్జున | మల్లికార్జున |
| 13 | అథర్వాణాచార్య | అథర్వణాచార్య |
| 16 | భిన్నాభిప్రాయము | భిన్నాభిప్రాయ |
| 1 | యందేనక | యందనేక |
| 4 | ఆశ్వాశాసా | ఆశ్వాసా |
| 22 | కలదు | కలవు |
| 18 | కవియిత్రి | కవయిత్రి |
| 16 | భాషాదు | భాషావాదు |
| 8 | కవిశేఖర | కవిరాజశేఖర |
| 14 | విక్రమార్యు | విక్రమార్క |
| 16 | ,, | ,, |
| 17 | నీతిసారా | నీతిసమ్మతో |
| 23 | కృత్తికా | తిథి-కృత్తికా |
| 2 | మన్నది | మున్నది |
| 7 | తమళ | తమిళ |
| 22 | మతేః | మతే |
| 2 | కృత్యాదిలోలో | కృత్యాదిలో |
| 7 | భాద్యతా | బాధ్యతా |

# నా పరిశోధనలు

పావులూరి గణితము

- ఆంధ్రపత్రిక, జనవరి 9, 1949 — ఆదివారము.

బద్దెన కవికాలము

- భారతి, జూలై - 1952.

తొలి తెలుగు శాసనం; దేశికవిత

- పరిశోధన, ఏప్రెల్ - 1954.

శ్రీనాథుని కల్పట్టణం

- పరిశోధన, జూన్, జూలై - 1954.

నన్నెచోడుని 'కుమారసంభవ' రచనాకాలం

- ఆంధ్రప్రభ, సెప్టెంబరు 7, 1958 - ఆదివారము.

తెనుగు తొలికావ్యము: కవిజనాశ్రయము

- భారతి, అక్టోబరు - 1959.

అథర్వణ కారికావళి కాలము

- భారతి, జూన్ - 1960.

వేములవాడ భీమకవులు - ఇద్దరు

- శశి, అగష్టు, అక్టోబరు, నవంబరు - 1958.

భాస్కరరామాయణ కాలము

- భారతి, సెప్టెంబరు - 1960